# రమాసుందరి

## ద్వితీయఖండము.

(అపరాధపరిశోధకనవల.)

గ్రంథకర్త

గ్రంధిసుబ్బారావుగారు.

ప్రకాశకుఁడు:

కొండపల్లి వీరవెంకయ్య,

బుక్సెల్లరు, రాజమండ్రి.

మూడవకూర్పు 2000

కాకినాడ:

కాకినాడసువార్తాక్షరశాలయందు

ముద్రింపబడియె.

1933.



[వెల రు 1—0—0

ఓం

# రమాసుందరి.

## ద్వితీయఖండము

### మొదటిప్రకరణము.

(అన్వేషణ)

బాలభానుఁడు తన ప్రచండతేజమును [illegible]గ్గించెను. పశ్చిమదిశను కొండచరియల లోపల దాగుకొనెను. ప్రాణమిత్రులకగిది రెక్కవాల్చక చూచుచు [illegible] దెసకు [illegible]కూటముగు సమీరకతంబున మార్గస్థులకు శక్తి [illegible] తెగిరిపోవుచుండెను. చలనహేతుకశకటములు బాటసారులను తప్పించుకొనుటకై "బుర్రు" "బుర్రు" మని శంఖధ్వనులు చేయుచాగెను. ద్విచక్రశకటములు బాటసారులను లెక్కచేయకయే మిక్కిలి వడివడిగా బోవుచుండెను. అందువలన బాటమీది రజము మింటిపై కెగసి చినచిన్న మేఘరాసులవలె నేర్పడి, నీలాంబరముక్రింద మరియొక యంబరమో యనఁ జూపట్టుచుండెను. సాయంత్రి మూఁడుగంటలాయెను.

అట్టితరి నొకయువకుడు విలువగలదుస్తులను ధరించి సవిలాసముగ చేతికఱ్ఱ నాడించుచు, కూనిరాగములు దీయుచు, నడుగులు మెల్లగనిడుచు, నలుకెలంకుల బరికించుచు, సుందరపుర వేశ్యవాటికకు చేరబోవుచుండెను. ఆతడొకచేతనో కాని గుమ్మమువద్ద వెరగంది నిలచిపోయెను. అత డట్లే పదినిముషము లచ్చోట నివ్వెరపడి నిలువబడిపోయెను. గతంబేమైయుండునా? యని పలుమారులు తనలో యోచించుకొనుచుండెను. ఎట్టకేలకాయువకుడు సోపానముల నవరోహించి తలుపువద్ద నిలువబడి తలుపుతట్టుచూ "సౌదామినీ!" యని పిలచెను. కాని లోపలనుండెవ్విధమైన యుత్తరమును బడయజాలకపోయెను. మరల నాతడు తనయుద్యమమును మానక "సౌదామినీ!" "సౌదామినీ!" యని రెండుసారులు బిగ్గరగా పిలచెను. ఈసారి తన ప్రయత్నము ఫలించెనోయన లోపలినుండి "ఎవరుమీరు?" అని కేక వినంబడెను. తోడనే యాతడు "ఎవరైననేమి? ముందు తలుపుదీసి మీరెవరని ప్రశ్నింపగూడదా?" అని జవాబొసంగెను

తలుపు తెరువబడెను. తోడనే యాతని కొక చక్కరబొమ్మ తన వాల్గంటిచూపుల నాతనిపై ప్రసరింపజేయుచు, రెండుతలుపురెక్కలను తన రెండుకరములను సాచి పట్టుకొని నిలువంబడియుండెను. ఆహా! ఆ సుందరాంగి సుందరంబెంచ నేరికి తరంబగును? ఆమె సుందరవదనారవిం

దంబున చిరునగవు తాండవమాడుచుండెను. కలువరేకుల ధిక్కరించు నాకందోయి చక్కదనరక దిద్దినట్లుండెను. గండుతుమ్మెదల నెకసక్కములాడు నామెకేశము లామె కొక వింతశోభను గలుగజేయుచుండెను.

ఆయువకు డామెను గాంచుటతోడనే లోలోన నవ్వుకొనుచుండెను. ఆమె మోమును తదేకదృష్టితో గాంచుచుండెను. ఒకరినొకరు చూచుకొనుచుండిరి. ముసిముసినవ్వులు నవ్వుకొనుచుండిరి. ఒకరినోటివెంబడినుండియు మాటమాత్రము బయటపడుటలేదు. పాప మా యువతికి లజ్జ మెండగుచుండెను. కొంతసేపటి కాయువకు డామెతో నిట్లు ప్రసంగింప సమకట్టెను.

యువ—సౌదామినీ! ఎందులకు నీకింతసిగ్గు?

సౌదా—మకరందా! జాగుసేయక లోనికిరమ్ము. సావకాశముగ మాటలాడుకొనవచ్చును. వారిద్దరును చూపరుల కానందమును గలుగజేయు నొక వివిధవస్తుసమన్వితంబై యున్న గహ్వరములోనికి జనిరి. వారిద్దరును చేరియొక సోఫా నధిష్ఠించిరి. ఆ చావడిమధ్యభాగమున నొక దారునిర్మితమైన బల్లగలదు. దానిపై నొక దీపము యరుణకాంతుల ప్రకాశించుచుండెను. ఆగదికి రెండే ద్వారములును, మూడుగవాక్షములు నుండెను. అందొకగవాక్షము వీధివైపునకు తెరువబడియుండెను.

సౌదా — ఏమండీ! చాలరోజులనుండి మీదర్శన భాగ్యము నాకు కలుగ లేమిచే మిక్కిలి కృశించియుంటిని. మిమ్ములనే దైవముగా నమ్మియున్నందులకా యీ ప్రాయశ్చిత్తము? చాలులెండు. ఇక మీమోము చూడరాదు.

మక — అంతమాటలన నేలా? నే నెంతతలపోసినను తీయకుంటిని! నే నిచ్చటకు రానంతమాత్రమున నిన్ను మఱచితిననియే తలంచితివా?

సౌ — మరేమి తలంపవలయును?

మక — నిన్ను మఱచితినని నీవు తలంచితివా! సరి! సరి! ఎంతమాట! ఒక్క త్రుటికాలమైన నీసుందరవదనారవిందము గాంచకుండ నుండగలనా!

సౌ — అంతమాటలన నేలా? నాలుగు రోజులకు ముప్పదిసారులు దర్శన మిచ్చుచున్నారు. ఏటికీమాటలివి? మొగవారు నాబోంట్ల నెటులయినను చెప్పెదరను.

మక — ఏమా! కోపము వచ్చెనా? శాంతింపుము. శాంతింపుము.

సౌ — యీ పరిహాసము నిక చాలించి మీకథను దెలుపుము.

ఇంతలో నకస్మాత్తుగా తలుపు చప్పుడాయెను. ఇరువురు నాశ్చర్యచకితులైరి. వారి హృద్వేగము వాయువేగమును నిర్గమించెను. మకరందుడు కూర్చున్నసోఫాపైనుండి గభా

లున లేచి ద్వారము తెరచి బయటకు బోయి యరుగుపై నిలువబడిచప్పుడైనకిటికీ వైపునకు దనదృష్టులు పారించెనుగాని సఫలీకృతమనోరథుడు కాజాలకపోయెను. తోడనే యాత డొక దీర్ఘనిట్టూర్పు పుచ్చి యథావిధిగ లోనికింజని కూర్చుండెను.

సౌదా—ఏమండీ! ఆ చప్పుడగుటకు కారణమేమి?

మక—ఏమియూ లేదు. నయారకతంబున నట్లు చప్పుడుగలిగి యుండనోపు. అయిననూ యిప్పుడు దానితో మన కేమి?

సౌదా—సరే! అట్లయిన మీకథ కానిండు

మక—నాకథ యేమున్నది? ఏమియు లేదే!

సౌదా—ఏమియు లేదా?

మక—ఏమున్నది?

సౌదా—ఉన్నది. మీరు రాకపోవుటకు కారణము.

మక—దానిమాట కేమికాని, నీ—

సౌదా—అట్లైన నేను బోయెదను.

అంత నాయువతి చటాలున సోఫాపైనుండి లేచిపోవుచుండెను. మకరందుడు డాపోవుచున్నయామెను పట్టుకొని సోఫాపై గూర్చుండజేసెను.

మక—మరేమియు లేదుకాని, మొన్న పోయిన నెలలో నీతో చెప్పినసంగతినిబట్టి యిచ్చుటకు వచ్చుటకు వీలు చిక్కినదిగాదు.

సౌదా—అవును! మరచితిని. ఆసంగతేమైనది? కొన సాగినదా?

మక—పూర్తిగా కొనసాగినది. అంతలో—

సౌదా—అదేమి?

మక—ఇంకేమున్నది? అంతయు పోయినది.

సౌదా—ఏమీ! అంతయు నీటగలసినదా? ఎట్లు?

మక—నా పన్నాగముల పాడుచేయుట కొకశని దాపురించినాడు. ఆపిశాచిమూలముననే యింతవచ్చినది.

సౌదా—ఆ శనిగ్రహ మెవ్వడైయుండును?

మక—మోహనరావు.

సౌదా—ఎవరు? నే నాతని నెప్పుడైన చూచితినా?

మక—లేదు. అతడు చూపులకు చిన్నవాడుగాని మిక్కిలి కుశాగ్రబుద్ధిగలవాడు.

సౌదా—మీరుమాత్రము పెద్దవారుగాబోలు!

మక—దానిమాటకేమిగాని, సౌదామినీ! వాడు దయ్యమో! మానవుడో గాని మెచ్చుటగాంచిన వాతడే ప్రత్యక్షమగుచున్నాడు.

సౌదా—ఆహా! ఇంతమందిని జయించితిరిగదా? ఆతని నొక్కని హతమార్పజాలకుంటిరా? ఎట్టివింత!

మక—నీ కంతయు వింతగానేయుండును. మోహనుని మనుష్యమాత్రుడని తలంచుట పొరపాటు. వా డజేయుడు.

అబ్బబ్బా! భూగృహమున వాడు చేసినయల్లరేమని వర్ణింతు ను? నా జట్టులోనివారిని కొందరిని హతమార్చినాడు. కమ లసింహుని విచిత్రగృహములో దాచిన మోహినిని విడిపించు కొనిపోయినాడు. కమలసింహునిగూడ మట్టుబెట్టినాడు.

సౌదా—అవును. అట్టివానిని మట్టుబెట్టుట కష్టమగు కార్యమే!

మక—కాదా మరి. నీవు మొదట నాలోచించి మాటలాడవు.

సౌదా—ఇప్పుడు మనకు కర్తవ్యమేమి?

మక—విచిత్రపన్నాగము బన్ని మోహనుని తుదము ట్టింపవలయును.

సౌ—అది యట్లుండనిండు. ద్రవ్య మేమయిన లభిం చెనా?

మక—లభింపకేమి? రాజుగారి ధనాగారమంతయు దోచుకొంటిని.

సౌ—అదెచ్చట పొందుపరచిరి?

మకరందుడు నలువైపుల గలయజూచెను. ఎవ్వరును గాన్పించలేదు. దీపముమాత్రము రక్తకాంతుల ప్రకాశించు చుండెను. వీధివైపున కిటికీ తెరచియున్నదని ముందే చెప్పి తిమి. అతడు కిటికీ తెరచియుండుటచే తాను చెప్పుచున్న మా టల నెవ్వరైన నాలింతురన్న భయముండి, దానిని బంధించి

జేసెను. మరల ద్వారమునొద్దకు బోయి తలుపుదెరచి, బయ
టకు దన దృష్టుల రెండు మూడుసారులు ప్రసరింపజేసెను.
అచ్చట నేమున్నది? మానవాకారము కంటికగోచరమగు
నంత కటికచీకటి యెల్లెడల విస్తరించియుండెను. అతడు సం
శయనివృత్తుడై మరల నెప్పటియట్ల తలుపు బంధించి లోన
గూర్చుండి సౌదామినిమోమును పరికించెను. ఆమె యట్లే
నిశ్చలహృదయయై కూర్చున్నస్థలమునందే చెక్కుచెదరక
యుండి ద్రవ్యమును పొంచుపరచిన స్థలనామ మెప్పుడు వం
దునా యని యువ్విళ్లూరుచుండెను.

మక—ఇచ్చట నెవరైన పొంచియుండి మనరహస్యా
లోచన నాలింతురని భయము గలుగుచున్నది.

సౌ—ఇంతరాత్రమున మనరహస్య మెవ్వ రాలిం
తురు?

మక—ఓసీ! వెఱ్ఱిదానా! నీవట్లు దలంపకుము.

సౌ—ఏమి?

మక—గోడలకు చెవులుండును. మోహనుడు మహా
చతురుడు. అసమానభుజబలపరాక్రమము గలవాడు. అతడు
దూరని మేరయే యుండదని తలంపుము.

సౌ—అయిన నాతడిప్పుడు మన ప్రసంగమంతయు
నాలించెనని యేనా?

మక—వినెనని యే తలంపగూడదా?

సౌ—అసంభవము! మీరిప్పుడేకదా బయటకుపోయి చూచిరి?

మక—అయినను సందేహనివృత్తికొఱకు మరల నొక సారి చూచివచ్చెదను.

సౌ—సరే! పోయి చూచిరండు.

మకరందుని మనసున నవమాన పెనుభూతము పీల్చి పిప్పిచేయుచుండెను. మరల నాతడు తలుపుదెరచి సంశయము దీరునట్లు పదినాలుగు పరికించి చూచెను. కాని యాతనికెవ్వరును గానుపించకున్న నంతకుంచి యాతడు లోనికిబోయి తలుపులు బంధించి సోఫాపై గూర్చుండెను.

మక—సౌదామినీ! నేను చెప్పున దాలింపుము!

సౌ—నేను సంసిద్ధనైయుంటిని.

మక—ఆధన మంతయును భూగృహమునందే దాచి యుంచితిని.

సౌ—ఎప్పుడు తీసికొనివత్తురు?

మక—రేపుదయమునందే దీసికొనివత్తును. ఇప్పుడు నేను జగదీశునితో మాట్లాడవలయును. నే బోయెదను.

సౌ—ఇప్పుడే వెళ్ళెదరా?

మక—జరుగురుగా మాట్లాడవలసిన పనియున్నది.

సౌ—ఆపనియేమి? దయయుంచి తెలుపుము.

మక—నీతో నన్నియు పుట్టుక మొదలుకొని యంత మగువరకు చెప్పవలయునుగాబోలు. తరువాత చెప్పెదను లెమ్ము.

సౌ—నాతో జెప్పిన దప్పా ? మీరహస్యము లేవైన బయటపెట్టితినా ? మీ రహస్యము లన్నియు పెట్టెలో బెట్టి తాళము వేసినట్లు నా పొట్టలో బెట్టుకొని వెలిబుచ్చక యుంచినందులకు కాబోలు ?

మక—అబ్బా ! నీవుమహాగట్టిదానవే ? చెప్పకతప్పదా యేమి ?

సౌ—చెప్పినంతమాత్రమున దప్పేమి ? నాతో జెప్పిన కొంపలు కూలిపోవునా ? తల లెగిరిపోవునా ? మీ పరిచ్ఛన్న వేమరహస్యముకానెను గూఢమైనదా ?

మక—సరియే ! చెప్పెద నాలకింపుము.

ఇంతలో నకస్మాత్తుగ "చర" "చర" మను చప్పుడు వినవచ్చెను. వెంటనే వారు భయకంపితులై ధ్వనివచ్చిన దెసకు తమదృష్టుల సారించిరి. పాఠకము ! వారి భయకారణ మేమి ? ఏమియును లేదు. ఒక మూషికము తనకలుగులోనికి పరుగెత్తినది. అందువలన చరచర మను ధ్వనికి కారణభూతమయ్యెను. ఆహా ! భూతలమున నపరాధకులకు చీమ చిటుక్కుమన్నంతశబ్దము వినుపించిన యంబరమే విరిగి మీఁద పడునంతటిభీతి జెందుదురుగదా ! అంత నా స్త్రీపురుషులు

భయరహితులై యొకరిమొ యొకరు చూచుకొని నవ్వు కొనిరి. తరువాత మకరందుడు వినుకొనుచు తలుపుయొద్దకు బోయి, తలుపు దెరచి యెవ్వరైన నున్నారేమోయని చూచెను గాని యెవరును లేరు. తోడనే యాతడు లోనికి వచ్చి తలుపులు బంధించెను. కాని యది "టిక్కు" మని శబ్దమిచ్చి బంధింపబడకయుండెను. ఆయువకుడు తలుపును పరిశీలింపకయే సౌదామినియొద్దకుబోయి యేమేమో రహస్యముగా చెప్పదొడంగెను. ఆమాటలు సరిగా వినుపించలేదు.

అకస్మాత్తుగా తలుపుదెరచిన శబ్దమాయెను. తోడనే వారు ద్వారముదెసకు చూచుచుండిరి. ఆహా! అద్భుతము—ఆశ్చర్యము—చిత్తవ్యాకులనము—ద్వారమువద్ద నెవరు? డిటెక్టివుమోహనరావు చేతి రివాల్వరు ధరించి, ప్రళయకాలరుద్రునివలెనిలిచి యుండెను. సింహగర్జనముచేయుచు వారలకు మృత్యుదేవతవలె ప్రత్యక్షమాయెను. పాప మాయువతీ యువకులకు నొక్కసారి భయాశ్చర్యము లుద్భవించెను. నిలువున స్తంభీభూతులైరి. వారి సర్వాంగములు కంపించి పోవుచుండెను. మోహనుడు వారలకు రివాల్వరు గురిపెట్టి యుంచి "పాపాత్ములారా! జాగ్రత్త. ఇంచుక కదలినచో నసువుల బాసెదరు. మీరహస్యప్రసంగ మంతయు నేనీ గోడమాటుననే గూఢముగ దాగియుండి నామూలాగ్రముగ

వినియుంటిని. ఇంక మీరు తప్పించుకొనిపోవుదురనిన కల లోనివార్త" అని యాతడు నెమ్మదిగా నాగద్వారమున ప్రవేశించుచుండెను. పాప మాయువతీయువకులు యొకరి మొకరు జూచుకొనుచుండిరి ఆ చూపులయందున్న భావమును మోహనరావు కనిపెట్టకపోలేదు.

---

## రెండవ ప్రకరణము.

---

అకస్మాత్తుగా దీప మారిపోయెను. వెంటనే దట్టముగు కటికచీకటి యాగదినంతయు పిశాచమువలె చుట్టుకొనెను. మోహను డాశ్చర్యచకితుడాయెను. అతని కేమియు దృగ్గోచరముగుట లేదు ఆ గాఢాంధకారమున నాతని కాయువతీయువకులుగూడ కాన్పించుటలేదు. మోహనుడు తనవద్ద నున్న విద్యుద్దీపమును వెలిగించి చూచెను——ఇంద్రజాలము—— స్త్రీపురుషు లిద్దరును మాయమయ్యిరి. ఆత డాగదియంత యు వెదకి చూచెను గాని సఫలీకృతమనోరథుడు కాజాలక పోయెను. అతనికొకగంభీరవాక్యిట్లు వినంబడెను. "మోహనా! ఎంత తెలివిహీనుడవు? నీవా నన్ను బట్టనెంచినవా డవు? ఏమివింత? ఎవ్వరైనను గాంచిన నవ్వగలరు. త్వరగ యిల్లుచేరుకొనుము. పాపము! మిక్కిలి శ్రమపడితివి! ఈ మాటలు మోహనుని హృదయఫలకమున గాఢముగ నాటు

కొనిపోయెను. అతనికి కోప మగ్గలమయ్యెను. హంతకుడు తన్ను మాయజేసి ప్రక్కగదియం దున్నాడేమోయని తలుపును త్రోసిచూచెను. తలుపు బంధింపబడియున్నది. ఆ తలుపున కిచ్చటనైన మీట యుండునేమో యని తలంచి, తన వద్దనున్న విద్యుద్దీపికాసహాయమువలన దానిని పరీక్షించెను. అతనికొక యినుపగొలుసు గానుపింప దానిని పట్టి గట్టిగ లాగెను.

విచిత్రముగా తలుపు తెరువబడ నాతడు లోనికేగెను. దానియం దాగంతుకుడు లేడు. ఆగహ్వరము సంస్కారహీనమై దట్టముగురజముచే నిండియుండెను. "దీనిఁజూచినను లేరే! ఈ గదిలోనుండి యేకవా సూటుగా బయలువెళ్ళినారా"? అని మోహనుడు నేలం బరిశీలించి "ఈ గదియంతయు రజముచే నిండియున్నది. కనుక నీగదిని ప్రవేశించిన మొదలవారి పద చిహ్నములీ రజమునందైన తప్పక పడియుండును. కాని పదచిహ్నములు లేవే! అట్లయిన నీగదియందు ప్రవేశింపలేదు" అని తన మనంబున పరిపరివిధంబుల చింతించుకొనుచు నాతడు ప్రక్కనున్న మరియొక గొలుసు లాగెను. మరల నింకొక తలుపు తెరువబడెను. దానిలో కూడ వారున్నారేమో యని చూచెను కాని లేరు. ఆగదియుగూడ నిర్జనమైయుండెను. "ఏమి నా వెర్రి! ఇంకను వారిచ్చట నున్నారని యే దలంచుచుంటిని! వారప్పుడే నన్ను మాయజేసి రహస్యమార్గముగుండా దాటి

బయటకుపోయిరి. (ఆలోచించి) ఆ స్త్రీమూర్తి యెవ్వరు ? ఆమెగూడ దొంగలగుంపులో చేరిన యువతియేయని వీరి సంభాషణవలన తెలియుచున్నది. ఔను ! ఆమగవారు లేకుండగ నిశాకాలంబున నేకార్యము జరుగుచున్నది ? ఆమె పేరు సౌదామినియా ? ఈమె కళావంతు లనుటకు సందియము లేదు. సరియే ! ఈయువతిని గురించి పక్కయింటివారి నడిగినయెడల సంతయు తెలియును" అని యాతడు బయటకువచ్చి, తలుపులన్నియు బంధించి, పక్కయింటివారిగుమ్మమునొద్దకు బోయి తలుపుతట్టుచు "మాణిక్యం" "మాణిక్యం" అని రెండుసారులు బిగ్గరగా పిలచెను. లోనుండి "నాయనా! మీ రెవరు ?" అని స్త్రీకంఠస్వరము వినుపించెను. మోహనుడు "ఎవరైన నేమి ? ముందు తలుపుదెరువుము" ? అని జవాబొసంగెను

తలుపు తెరువబడెను. మోహనునియెదుట మూర్తీభవించిన గృహలక్ష్మియో యన నొక స్త్రీమూర్తి ప్రత్యక్షమాయెను ఆమెయే వేశ్యకులభూషణ మని పేరుగాంచిన మాణిక్యము. ఆమె "మహాశయా ! లోనికి దయచేయుడు" అని మోహనునితో ననెను. అంత నాయువతీయువకులు లోనికిబోయిరి.

మోహ—మాణిక్యమా ! నే నెవరినో యెఱుగుదువా ?

మోహ—తెలిసియుండిన చెప్పుము. చెప్పినంతమాత్రమున తప్పేమి ?

మాణి—అబ్బే! తప్పేమున్నది ? చెప్పెదవినుము. ఆమె నెవరో యొకయువకుడు దెచ్చి యిచ్చుటనుంచినాడు. ఆ యువకుని పేరు మకరందుడట. నా రీయింటిలో ప్రవేశించిన కొద్దిరోజులవరకు మాత్రమే యామకరందు డెప్పుడు చూచిన నీమెయొద్దనే యుండువాడు. అదేమోగాని నెలరోజులనుండి యింటికి రావడము మానివేసినాడు. ఒక్కొక్కప్పుడు వీ రిద్దరును మిక్కిలి రహస్యముగా మాటలాడుకొనుచుండెడివారు. కాని యవి నా కెంతమాత్రమును వినుపించినవి కావు. నా కింతవరకే తెలియును.

మోహ—మకరందుని దేయూరు ? ఈయూరేనా ?

మాణి—కాదు. కాదు. ఈయూరు కాదు. ఆమె నాతో నదేదో యూరుపేరు జెప్పినది. నాకు సరిగా జ్ఞప్తికి వచ్చుట లేదు.

ఇక నామెను ప్రశ్నించుటవలన లాభము లేదని తలచి మోహనుడు బయటకు వచ్చెను. నెమ్మదిగా బోవుచుండెను.

---

## మూడవ ప్రకరణము.

---

అప్పటికి రాత్రి పదిన్నరగంటలాయెను. తిమిరరాజము భయంకరముగ నిరంకుశాధికారము నెరపుచుండెను. అంత

యు నిశ్శబ్దమయము. ఆ నిశ్శబ్దమయమున కొండవాగుల మర్మరధ్వనులు మోహనునికి కర్ణరంజకముగా నుండెను. పురజనులందరకును తొలిజాము నిద్దుర దిట్టముగ పట్టెను.

ఆ నిశీధసమయమున మోహనుడు భయరహితుడై నడచిపోవుచుండెను. ఆచీకటాతనికి పిశాచమువలె గాన్పించుచు డెను. అంతమాత్రమున నాతడు భయమొందలేదు. ఒంటరిగా బోవుచుండెను. చేత రివాల్వరు లేకపోలేదు.

అట్టిసమయమున నాతని కొకవ్యక్తి కన్పట్టుట ప్రత్యక్షమయ్యెను. మోహనుడు జడియలేదు. చేతనున్న రివాల్వరు నావ్యక్తి వక్షస్థలమునకు గురిపెట్టి "నీ వెవరవు?" అని నిర్భయముగా ప్రశ్నించెను. ఆవ్యక్తి సత్వరము "మోహనా! ఏల యీలీల తత్తరపడెదవు? నీ విద్యుద్దీప మేమయ్యెను? దాని నొకమారు వెలిగించిచూడుము?" అనెను. పాపము! మోహనుడు తన విద్యుద్దీపమునుమాటయే మరచెను. అంత నాతడు తన దీపిక వెలిగించి యావ్యక్తిని పరికించెను. ఆ వ్యక్తి యెవ్వరు?—భీముడు.

మోహ—భీమా! ఎచ్చటికి బోవుచుంటివి?

భీము—మోహనా! నాతో పరిహాసములాడెదవా?

మోహ—ఏమీ! పరిహాసమాడుచుంటినా? ఎచ్చటకు బోవుచున్నావనిన పరిహాసమా? ఇంతరాత్రమున నెచ్చటికి బోవుచుంటివి?

భీము—పరిహాసముగాక మరియేమి ? నన్ను రమ్మని కబురంపితిరిగదా ? అందువలన నే వచ్చితిని.

మోహనుని కనుమానము దృఢమయ్యెను. హంతకులే వానినట్లు జేసిరని తలంచెను. సంగతి త్వరితముగ తెలిసికొనుటకై తహతహలాడుచుండెను.

మోహ—ఎవరిద్వారా కబురంపితిని ?

భీము—ఏమది ! వింతగానున్నదే ! ఉత్తరముద్వారా కబురంపలేదా ?

మోహ—ఏ వాయుత్తరము ? నీ వద్దనున్నదా ?

భీము—లేకేమి ? యున్నది.

అని భీముడొక యుత్తరము తీసి మోహనుని చేతియందిడెను. మోహనుడు దానిని విప్పి యిట్లు చదువుకొనెను.

"భీమా !

ఈ యుత్తరమును గాంచిన వెంటనే బాగుచేయక త్వరితముగ రావలయును—కళావంతులవీధి—ద్వితీయ గృహము—చోరచిహ్నములు దొరకనున్నవి.

ఇట్లు,

నీ ప్రియమిత్రుడు,

మోహనరావు"

వెంటనే మోహనుడు నిర్ఘాంతపడిపోయెను. ఇందంతయు నాతని కిందరిజాలమువలె నుండెను. హంతకునిమాయల కచ్చెరువందుచుండెను. ఉత్తరమును గాంచినంతనే హంతకుని మాయవలె గ్రహించెను.

మోహ—భీమా! మొదటినుండియు నీవు మాయలలో వెలిగినవాడవు గదా?

భీము—అవును. ఇప్పుడేమి?

మోహ—ఏమనియెదవేమి సంపూర్తిగా మోసపోతిని.

భీము—మోసపోయితినా? ఈయుత్తరము నీవు వ్రాయలేదా?

మోహ—ఇది నేను వ్రాసినట్టున్నది గాని, నా స్వహస్తలిఖితము కాదు. అబ్బా! హంతకునకు సమస్తవిద్యలయందును నసమానపాండిత్యము గలదే! సరే అయినదేమో యయినది. ఇక ముందు మాత్రము జాగరూకత వహించి మెలగవలయును భీమా!

భీము—మోహనా! వారిజట్టులోనివాడను నన్నే బుట్టలో బెట్టిరి.

మోహ—ఈ యుత్తరము నీ కెవరిచ్చిరి?

భీము—పారావాడు.

మోహ—పారావాని కెవరిచ్చిరి?

భీము—అపరిచితుడు.

మోహ—అపరిచితు డిచ్చెనని తెలిసియుండియు, నిట్లమాయకునివలె పరుగిడివచ్చితివా ?

భీము—ఉత్తరము నీ స్వహస్తలిఖితమై యుండుటం బట్టి—

మోహ—సరే! మనమిక నింటికి పోవుదమురమ్ము.

భీము—ఔనుగాని, ఈకళాపంతులుగా రిక్కడికి ని వెందుకువచ్చితివి? నీవిచ్చటనున్నసంగతి హంతకున కెట్లు తెలియును ?

మోహ—ఇచ్చట నొక విచిత్రము జరిగినది. దొంగ దాటిపోయినాడు. ఇక నెందులకు ? కావలసినంతయు తరువాత తెలిసికొందువు రమ్ము.

భీము—ఎట్లు దాటిపోయినాడో యించుక దెలుపుము.

మోహ—స్వాసబలిమినిబట్టి—తెలిసినదా ?

భీము—తెలిసినది.

వారిరువురును ముందునకు సాగిపోవుచుండిరి. అప్పటికి పదునొకండు గంటలాయెను. ఆ తమోమయంబున వారు నిర్భీతులైపోవుచుండిరి హఠాత్తుగా నాపురుషద్వయము మాగి పోయెను. ఏమీ ? ఎకాట భూతముకాదుగదా ? కాదు. వారలకు దవ్వుననుండి మాటలు వినవచ్చుచున్నవి. అందు వలన వారట్లు నిలువబడి చెవియొగ్గి వినుచుండిరి.

"మోహనా! భీకరసాగరమున చిన్నదోనెపై గూర్చుండి ప్రయాణమొనరించుచుంటివా? ప్రమాదమునుమాఁ జూడుము? అపాయకరంబులగు పెద్దపెద్దయలలు చేయెత్తి నిన్నట్టురమ్మని పిల్చుచున్నవో! మునిగిపోయెదవు. జాగ్రత్త! జాగ్రత్త! మోహనా! నీయుద్యమును మానుము. మానని యెడల యసువులబాసెదవు" అని వినంబడెను.

దధ్వననుండి మాటలు వినవచ్చుటచే వారాదెసకు బోవలేదు. భీముడు మిక్కిలి కంగారుతో "మోహనా! వింటివా? ఆకంఠస్వర మాహంతకునిదే. చూడుము! వాడెట్లుల మనప్రయత్నములు మానుమని పలుకుచున్నాడో?" యని మోహనునితో ననెను. "భీమా! వానియాటలింకెన్నినాళ్ళు రమ్ము రమ్ము." అని మోహనుడు బదులుపలికెను. మరల వారు యథావిధిగ నడచుచుండిరి. వారు చీకటని జడియుటలేదు. ఒకరితోనొకరు మాటలాడుటలేదు. మోహనుడు తన చేతనున్న విద్యుద్దీపిక వెలిగించి, దానికాంతిని బాటపై బ్రసరింపజేయుచుండెను. ఆ కాంతిసహాయమున వారిరువురును మరింత వడివడిగా నడచుచు బోవుచుండిరి. జగమంతయు ప్రశాంతమై యుండెను. నీలాంబరముపై తారక లక్కడక్కడ మినుకు మినుకని మెఱయుచుండెను. వాటికి జేదోడు వాదోడుగా నగరవీధులయందలిదీపములు గూడ కాంతివిహీనములై యుండెను.

కొంతసేపటికి వారు కోటను సమీపించిరి. కోట మొదటిద్వారమువద్ద కాపలా కాయుచున్నవారు గాఢనిద్రాపరవశులై యుండిరి. పాపము! నిద్రాదేవి నెత్తిపై గూర్చుండి తాండవమాడుచుండినవారు నిద్రపోవక నేమిచేయగలరు? ఆ నిద్రపోవువారిలో నొకయువకుని భీముడు "నారాయణా!" యని తట్టి లేపెను. వెంటనే యాతడదరిపడి లేచి "ఎవరదిరా" యని ప్రశ్నించెను.

మోహ—నేను మోహనరావును. ఏ నిద్రమత్తు వదలినదా? లేదా?

నారా—మోహనరావుగారూ! బాబూ! ఏమి సెలవు.

మోహ—(భీమునితో) భీమా! వీడేనా? నీకుత్తరమిచ్చినది?

భీము—ఇతడే.

మోహ—నారాయణా! ఎవరు నీచేతికుత్తరమిచ్చిరి?

నారా—బాబూ! ఆతడెవరో నాకు తెలియదుగానండీ, మీయంతపొడుగున్నాడండి. ఆతని పేరు రామారావట. మిమ్ముల బాగుగా నెఱుగునట.

మోహ—ఉత్తర మెవ్వరికిమ్మనెను?

నారా—భీమయ్యగారికి.

మోహ—నారాయణా! వాడు రామారావు కాడు. మాయదొంగ. మమ్ములను మోసముచేసినాడు. ఇకమీద మెలుకువ గలిగియుండుము.

భీము—మోహనా! ఏమి టాలోచించుచున్నావు? జగదీశునియందు నీ కనుమాన ముదయించినదా?

మోహ—అవును.

భీము—ఒక్కసారి నాతో మాటలాడినంతమాత్రమున వానిని దొంగయని తలంచితివా? ఎట్టివింత?

మోహ—అంతమాత్రముననే వానిని దొంగయని తలంచుటకు నేనంత మందమతినా? ఇప్పుడు కళావంతుల వీధియందు జరిగిన మాయనాటకములో హంతకు డొకయువతితో సంభాషించుచుండగా నేనదికనిపెట్టి వారిగూఢసంభాషణమంతయు గోడమాటున డాగియుండి వినుచుంటిని. అంత వానినోటనుండి "జగదీశునితో మాటలాడవలయు" నను వాక్కు నాకు బాగుగ వినంబడెను. అందువలన నాకు వానిపై ననుమాన ముదయించినది.

భీము అట్లయిన నిప్పు డేమి చేయుదము?

మోహ—వానియిల్లుగూడ నెదోవిధముగ పరీక్షింపవలయును.

భీము—సరే! మోహనా! అర్ధరాత్రము మీరినది.

మోహ—అటులయిన పోవుదమురమ్ము.

వారు కాపలాకాయువారిని జాగరూకతతో నుండవలయునని జెప్పి రయమున కోటలోనికిబోయి శయనించిరి.

---

## నాల్గవ ప్రకరణము.

---

అర్ధరాత్రమయ్యెను. అయినను మోహిని మనోహరముగ నుద్యానవనమున విహరించుచుండెను. ఆరామము ప్రశాంతమైయుండెను. ఆమె పద్యఖండమును పాడుచుండెను. మంచులో దడసి పూలను కోయుచుండెను. ఒక్కొక్కమారు నీలాంబరము వైపునకు జూచుచుండెను. ఆయంగనామణి చిగురుటాకుల మెత్తదనమును దిరస్కరించుపదములసొగసుతనమూ చంద్రకాంతియందు మిలమిలలాడుచుండెను. ఆమె యుద్యానవనం బంతయు గలయదిరుగుచు నొక్కొక్కప్పుడామె యెవరికొరకో వెనుదిరిగి పలుమారు చూచుచుండెను.

ఇంతలో మోహిని చెలికత్తెయగు తరళ మిక్కిలి యాతురతతో గాళ్ళు తడబడ మోహిని చెంతకు పరుగెత్తుకొనివచ్చి "అమ్మా! మీనాన్నగారెందులకో కాని రయమునరమ్మని కబురంపినారు. అదిగో! ఆవీధియందున్న మేడలో గూర్చొనియున్నారు. దూరప్రయాణము చేయుదురట" అని చెప్పెను. చదువరా! ఒక్కమారాయువతుల వెనుకనున్న పూపొదరింటిం గాంచుడు. అచ్చట నొకవ్యక్తి పొంచియుండి వీరిమాట లాలించుచున్నాడు.

మోహి—ఇంతరాత్రమున ప్రయాణమేమి ?

తర—హంతకుల బట్టుకొనుటకు కాబోలును.

మోహి—సరే! అటులయిన దర్శింతము రమ్ము.

అని నుడివి మోహిని ముందునడువసాగెను. ఆమె వెనుక తరళ నెమ్మదిగా ముందు వెనుక లరయుచు బోవుచుండెను. ఆ రాత్రి యామోదయం దాన నమా సుత్తై మరల వడివడిగా నడచుచుండిరి. తరళ వచ్చుచున్నదో లేదో యని మోహిని వెనుదిరిగి చూడనైన చూడలేదు. ఆమె శిరస్సుపై పూర్ణచంద్రిక ప్రసరిల్లెను, సముద్రపుకరుళ్ళవలెను, శివుని శిరస్సుమీదనుండెడు యాకాశగంగా ప్రవాహమువలెను, తెల్లని సుందరంబగుకాంతితో ప్రకాశించుచుండెడి వజ్రకాంతి యచ్చట మిలమిలగ నలుగొనియున్న పూపొదరిండ్లలో నాట్యముచేయుచున్న తిమిరరాజమును తరిమివేయుచుండెను. అంతయు నిశ్శబ్దమయమై యుండెను.

ఈసమయమునందు పొదరింటిచాటున దాగియున్న వ్యక్తి యానిశ్శబ్దతకు భంగము వాటిల్లకుండునట్లు నెమ్మదిగ లోనుండి బయటకువచ్చి యాపోవుచున్న యువతుల వెంటనంటెను. అట్లాతడు పోయి వెనుక నెమ్మదిగా నడుగులిడుచు బోవుచున్నతరళను సమీపించి యామెకంఠము నొకచేతితో నదిమిపట్టి తనజేబునందున్న త్రాటిని బయటకు దీసి దానిచే నామెను బంధించివేసెను. అతడామెకంఠముపట్టు వదలివేయగా నామె "మోహనా! చచ్చితినని కేకవైచి నేలం బడిపోయెను.

మోహి—మోహనా! నీవు నిజముగ మోహనుడ వేనా? లేక నాకట్లు దోచుచున్నావా? కాకున్నచో నిద్రావస్థనుంటినా? కలగాంచుచుంటినా? ఆమె నాచెలికత్తె యగు తరళగాదా?

మోహ—తన్వీ! నీవు జాగ్రదవస్థయందే యుంటివి. కాని యామెమాత్రము నీ చెలికత్తె యగు తరళ కాదని తెలుసుకొనుము.

మోహి—మోహనా! నామనస్సంతయు కలత జెందుచున్నది. ఇదంతయు వింతగా గన్పట్టుచున్నది.

మోహ—తరుణీ! ఈకలికాలమున వింతల కేమి కొదువ? సంగతంతయు నొక్కతుటికాలములో తెలిసికొందువు లెమ్ము.

మోహనుడు చెంతనుండుటచేత మోహిని ధైర్యసహితయయ్యెను. అంత వారలిద్దరును గలసి బంధితయై పడియున్న తరళయొద్దకు బోయిరి. తరళకు మతిపోయినది. ఆమె మాటలాడుటలేదు. నయనములు ముకుళితములై యుండెను. ఆమె నిజముగా తరళయేనా?

మోహ—మోహినీ! ఆగంతుకుని బరీక్షింపుము?

మోహి—(ఆశ్చర్యముతో) అదేమట్లంటిరి? స్త్రీని పురుషునిగా సంబోధించితిరేమి? మీకు గూడ నొక్కొక్కప్పుడు తప్పులు వచ్చుచుండునా?

మోహ—నేను తప్పుబలుకుటలేదు. నీవుమాత్రి మీవ్యక్తిని రూపవేషములనుబట్టి తరళయనియే భ్రమించు చుంటివి.

మోహి—తరళవేషధారియగు హంతకుడా వీడు? ఆహా! ఏమి విచిత్రపన్నాగము! మోహనా! తరళయే యిట్లు నన్ను మాయజేయనుద్దేశించిన దని తలంచితిని. అట్లయిన తక్షణమే యీస్త్రీవేషధారిని చెఱసాల నాజ్ఞాపింపుము.

మోహ—నీమాట ప్రమాణసముగా నేయున్నది.

మోహనుడప్పుడు రాజభటులు వచ్చున ట్లొకయీల వైచెను వెంటనే నలుగురు రాజభటులచ్చటికి సాయుధపా ణులై సుశిక్షితులవలె ప్రత్యక్షమైరి. వారు మోహనుని యాజ్ఞనను సరించి యాపడియున్న తరళను నిలువబెట్టిరి. తరు వాత మోహనుడు వారికాయువతివలువలను విడలింప నా జ్ఞాపించెను. ఈమాట వినినతోడనే యా రాజభటులు సంశ యచిత్తులై యొకరిమొ మొకరు చూచుకొనుచుండిరి. వారి చూపులను మోహనరావు కనిపెట్టి వారలతో "భటులారా! మీరు సంశయింపనక్కర లేదు. నిజముగా మీ రీవ్యక్తి స్త్రీ యనియే భావించితిరా? వద్దు అట్లు తలపవద్దు ఈవ్యక్తి స్త్రీరూపమునుధరించిన పురుషుడు" అని తెలియజెప్పగా నారాజభటు లాశ్చర్యచకితులై యావ్యక్తి వలువను విప్పు చుండిరి. విప్పుచున్నసమయమున వారికి స్త్రీచిహ్నములేవి

యు గానుపింపమి సంతోషనివృత్తులై యావ్యక్తి ధరించిన చీరనంతయు సంపూర్తిగా విదలించిరి. ఎవరువారు. ఏమో! మనకపరిచితులు. మోహనుడు వానినిట్లు ప్రశ్నింప మొదలిడెను

మోహ—ఓయీ! నీవృత్తాంతంబంతయు జెప్పెదవా? లేదా?

వ్యక్తి—చెప్పెద నాలింపుము. నేను సుదర్శనబలగ హంతకుడను. నాప్రభువునానతి ప్రమోహిని హరించి పని అందువలన కారాగృహంబున నాలకొనిని గొంపొమ్మని నాకనుజ్ఞనీయగా నిట్లు ప్రయత్నము చేయుచుంటిని ఈ సౌధమునందే తిరుగులాడుచుంటిని ఎవ్వతె మోహినియని గొంపోయి మాయేలికపాదంబులకడ నిడుదునా యను పలువిధముల యోచించి యిప్పటి కీపన్నాగము బన్ని సఫలీకృతమనోరథుడను గాజాలక మీచే పట్టుబడితిని ఇదియే నావృత్తాంతము.

మోహ—మీ యేలిక నామధేయమేమి?

వ్యక్తి—శ్యామలరావు.

మోహ—హంతకునికి నివాసమెచ్చట?

వ్యక్తి—పాతాళగృహమున.

ఇంత వారి కెచ్చటనుండియో యార్తనాదము వినంబడెను. మోహను డాతని ప్రశ్నించుటమాని యాయార్త

నాదము బయలువెడలి వచ్చుచున్న దెసకు తనచెవియొగ్గి వినుచుండెను. అది యొక స్త్రీ కంఠస్వరము — సహాయాపేక్షగల నారీకంఠస్వరము— ఆ కంఠస్వరము రుద్ధమైయుండెను. మోహనుడా దెసకు బర్విడిపోయెను. ఆకంఠస్వరము వినంబడుట లేదు. అంతయు నిశ్శబ్దము. మోహనుడు నిలువబడిపోయెను. కాని యాతనిహృదంతము ముందునకుబోవ త్వరపెట్టుచుండెను. మరుక్షణముననే మరల మూలుగు వినుపింపజొచ్చెను. తోడనే యాతడు ముందునకు నడువసాగెను. చటాలున నాతడు వెరగంది నిలువబడిపోయెను అచ్చట నేమున్నది? స్త్రీయొకర్తె బంధితయై పడియుండి మూలుగుచుండెను. కండ్లవెంబడి యశ్రుధారలు ప్రవహించుచుండెను. ఆమెనిద్దంపుచెక్కుటద్దము లెఱ్ఱనై కందియుండెను. ఆమె నోటనుండి మాట రాకుండుటకై గుడ్డ కూరబడియుండెను. ఆమె యంగములామె స్వాధీనమునందు లేవనియే చెప్పవచ్చును.

మోహనుడు నిర్ఘాంతపడిపోయెను తనవద్దనున్న కత్తిచే నామె బంధనముల విదలించెను. నోటనున్న గుడ్డతునకను బయట కూడదీసెను. ఇంకను నామె యుశ్లో పడియుండుటచేత మోహనుడుపచారములు చేయవలసివచ్చెను. కొంతవడికామె కన్నులు తెరచిచూచెను ఎదుట మోహనుడు. ఆతడామెను "తరళా!" యనిపిలచెను కాని యామె మారుపలుకకయే వెఱ్ఱిచూపుల మోహనునిముఖమండలమును గాంచుచుండెను.

మోహ—తరళా! నీకిట్టి దురవస్థ ప్రాప్తించుటకు కారణమేమి?

తర—ప్రభూ! ఏమనిచిన్నవింతును. నా ప్రాతఫల మిట్లున్నది.

మోహ—భయములేదు. చెప్పుము.

తర—మోహిని నన్ను కొండొకవిషయమై మాటలాడవలయునని బిలచినది. అందువలన నే నీస్త్రీవనుబట్టి యామె చెంతకేగుచుండ నకస్మాత్తుగా నెవరో యొక స్త్రీమూర్తి వెనుకనుండి రహస్యముగవచ్చి నా కంఠము నదిమి పట్టినది. కేకవేయుటకైన నవకాశము గలుగనీయకుండ నానోట గుడ్డముక్క నొందు కూరినది. తరువాత నాదేహమంతయు త్రాళ్ళచే బంధించివైచి, యిచ్చట పరుండబెట్టి మరల నెచ్చటకో తన యిచ్చారీతినిబోయినది.

ఇంతలో హఠాత్తుగా దిక్కులు పిక్కటిల్లునట్లు 'ఢాం' అను శబ్దము వినవచ్చెను. నిర్మలనిశ్శబ్దసమయమున నాధ్వనికి వృక్షములపై నుల్లాసముగ నిదురించుచున్న శకుంతసంతానంబు లొక్కమారుగా కిలకిలారావంబులతో మింటికెగసిపోయెను. ఆధ్వని యింకను మోహనునికర్ణపుటంబుల ప్రతిధ్వను లీనుచుండెను. ఆధ్వని కాతడు నిలువెల్లం స్తంభితుడాయెను. మనంబంతయు కలతనొందుచుండెను. నివ్వెరపడి నల్దిక్కుల గాంచుచుండెను. ఆ తరళిగూడ మోహను నను

ఘరించియే యుండెను. అంత వా రిద్దరును ముందు మోహా నును పడిసివచ్చిన స్థలమునకు బోయిరి. ముందు మోహానుడు తన మనంబున "ఆగంతుకుడు తన ప్రాణరక్షణార్థమై రివా ల్వరు పేల్చియుండవచ్చు" నని తలంచెను. కాని యట్లు జరుగ లేదు. అచ్చటకు బోయి చూచిరి వెంటనే నా యువతీయువ కులు నిర్ఘాంతపడిపోయిరి. మోహానుని సర్వాంగములు కంపించిపోవుచుండెను కారణమేమైయుండును ?

మోహినికి గుండు దెబ్బ తగులుటచే తూలిపోవుచుం డెను. రాజభటులు నాంతకుని దనుక్ప్రాణములచే నొడలం తయు తూట్లుపడి రుధిరము స్రవించుచున్నను పొగుచుచుండిరి. మోహిని తూలుచు "మోహానా! నేను దివికేగుచున్నాను" అని గభాలున నేలం గూలిపోవుచుండెను. ఆ సమయమున మోహాను డామెను నేలను బడనీయక తనకంపితహా సము లతో నామెను తన సందిటబట్టి యుంచెను. అతడు రాజభటు లవంక దిరిగి శ్రీశయకాలరుద్రినివలె మండిపడుచు "రాజభ టులారా! కృతఘ్నులారా! ఆగంతుకు డీమెను రివాల్వరు తో గాల్చుచున్నప్పుడు మీర లేమి చేయుచుండిరి? చేతు లకు గాజులు దొడిగించుకొనుచుండిరా? మూర్ఖులారా! మీరు నల్వురుండిరే? ఒక్కయువతి ప్రాణములను గాపాడ జాలకపోయిరా? మీరు మగవారని నే నెట్లుపిలతును? మీ ముఖములు చూడరాదు" అని వారిని చీవాట్లుపెట్టి

మరల వారితో "మీరీహంతకుని దీసికొనిపోయి చెఱయం దుంపుడు" అని యాజ్ఞాపించెను. వెంటనే యా రాజభటులు లా హంతకుని చేతియందున్న రివాల్వరును లాగికొని, వానిని త్రాళ్ళచే బంధించి నేలంబడవైచి మరల వాని కాలి కొక త్రాటినికట్టి చచ్చిన సారమేయంబుపగిది చరచర నీడ్చుకొని పోయిరి పాపము తరళ కేమి చేయుటకును దోచుటలేదు. ఆమె యట్లే వెరగంది నిలుచుండిపోయెను. మోహనుడామె నుచూచి "తరళా! ఈ ఘోరవార్తను విక్రమసేనున కెఱింగించి వెంటనే యాతని నిచటకు దోడ్కొనిరమ్ము" అని యాజ్ఞాపించెను. తరళ వెడలిపోయెను. మోహనుడు నేలపై గూర్చుండి, మోహినిని తనతొడలపై పరుండబెట్టుకొనెను. తన జేబురుమాలుచే గాయమునకు కట్టుకట్టెను. రుధిరము స్రవించుటలేదు. మరల నామె పైటచెరగుచే నామెకు విసరుచు గూరుచుండెను. ఆహా! ఎంతఘోరము!

---

## ఐదవ ప్రకరణము.

---

"హా! ఎంతపని జరిగినది! దైవమా! నీమాయలెన్న నేరికి తరంబగును. ఓ మాయాప్రపంచనాటకసూత్రధారా! ఇంతలో నెంతమాయబన్నితివి? (మోహిని మోము తిలకించి) మోహినీ! త్రిజగన్మోహినీ! నీకమలనయనములిక వికసింప

వా? నీముద్దులొలికెడు మోము ముకుళించియున్న దేమి? హా! హృదయేశ్వరీ! ఇక నీజన్మమునకు నిన్ను జూచుభాగ్య మీదౌర్భాగ్యునకు లభించునా? నాదర్శనార్థమై వేళపాళల కన్నపానీయములు లేక తహతహ లాడుచుండు పరమసాధ్వివి. కాంతామణీ! నీ శృంగారచేష్ట లెన్నివిధంబుల మఱతుమన్నను మఱపునకు రాకున్నవి. కటకటా! మనము కూడియుండుట చూచి యోర్వలేక పాపపుదైవము మనల నెడబాటుగావించెను. హా! రమణీ! పద్మవిశాలనేత్రి! సంపూర్ణపూర్ణిమాచందురుని ధిక్కరించు నీదివ్యతేజోమంగళసుందరవదనారవిందము గాంచక నేనెట్లు సజీవుడనై యుండగలను! తరుణీ! ఏదీ! యొక్కమారు నీపసిండిఛాయతో నిగనిగలాడుచున్న పెదవుల గదల్చి, యీపాపుని నొక్కమారు నీ యమృతము లొలికెడు చిలుకపలుకులతో నన్ను ధన్యునిజేయుము. ఆహా! నేనెంత మతిమాలినవాడను! నే నుండియుగూడ నిన్ను గావించితినే!" అని మోహనుడు పరిపరివిధముల పొంగిపొరలి వచ్చుచున్నదుఃఖము నాపుకొనజాలక, మోహిని మోమును దిలకించుచు నేడువసాగెను. పాప మాతనియేడ్పు నెవ్వ రాలింతురు! ఆహా! కమలనయనా! నీకు కొంచెమైనను కనికరము లేదా! నీ వెంతదయారహితుడవు!

కొంతసేపటికి మోహిని నెమ్మదిగ కదలెను. కనులు తెరచి మోహనునివైపునకు దీనముగ జూచెను. అతనికి దుఃఖ

సాగరము మరింత విజృంభించెను. మోహిని యస్ఫుటవచనం బులతో మోహను నిట్లు ప్రశ్నించెను.

మోహి—మోహనా! విలపించుచుంటివా ?

మోహ—(కండ్లనీరు రాపుకొని) లేదు.

మోహి—అదేమి ? నీ నయనములయందు—?

మోహ—దుఃఖసాగరవీచికాపరంపరలు.

మోహి—ఎందులకు వచ్చుచున్నవి ?

మోహ—నీ దండ వసించుభాగ్యము నాకిక గలుగదని.

మోహి—నాయనా! వద్దు వద్దు విలపింపవద్దు. నాకంటె నెక్కుడు చక్కదనాల చుక్కలదండ వసించుభాగ్యము నీకు పట్టును.

మోహ—ఎందరున్న నేమి ? నీవుమాత్రముందువా ?

మోహి—అది యే, నీకున్న వెఱ్ఱి.

మోహ—వెఱ్ఱియేటు? నీవుమాత్రముందువా? మోహినీ!

మోహి—నాసోదరిసమానురాలగు రమాసుందరి లభించునుగదా ! ఇంక నేమికొరత? ఆమెను గూడియుండి సకలసౌభాగ్యము లనుభవింపుము.

మోహ—సరే! మరి నీమాట?

మోహి—నామాటకేమున్నది? నేబోయెదను.

మోహనుని మనస్సు మనసులో లేదు. ఈ ప్రపంచ మంతయు దలక్రిందైపోవుచున్నట్లుండెను. అతడు పూర్తిగా నున్మాదుడైపోవుచుండెను. ఆడినమాటయే పదిసారు లాడు చుండెను.

మోహ—మోహినీ! ఎచ్చటకు బోయెదవు?

మోహి—దివికి.

మోహ—(నిండుదుఃఖముతో) పోయెదవా?

మోహి—ఏల యీలీల బాలునివగిది యేడ్చెదవు? ఇక జీవింపజాల. ఏదీ! ఒక్కసారి నీ నిద్దంపు టెక్కుటద్దముల ముద్దుగొననిమ్ము.

అని మోహిని తన ప్రేమప్రవాహము నాటంకపరుప జాలక మోహనుని చేయి పట్టుకొని తన మృదు శాంగులీయ ముల బెనవేసి యాతని మోముపై మోముచేర్చి తనివిదీర పదిసారులు ముద్దుగొనెను. ఆముద్దులయందేమున్నది? ప్రేమ తప్ప తదితర బాహ్య ప్రపంచ రాజభోగము లేవియు లేవ నియే చెప్పవచ్చును.

మోహనున కేమియు దోచుట లేదు. ఆమె మోము ను పరికించుచూ గూర్చుచుండెను. మాటిమాటికి కామె నాడిని పరీక్షించుచుండెను. నిరుత్సాహు డగుచుండెను. పాప మా తని నేత్రములు కన్నీళ్లచే నొరసిపోయెను. మోహిని మరి మాటలాడజాలక పోయెను. ఎందువలనన, ఆమె యొసలం

తయు నొప్పులెత్తుచుండెను. ఏమేమో తనలోదాను గొణుగు కొనుచుండెను. ఆత డామోహాస్త్రమును బట్టుకొనియేయుం డెను. మరల నాతఁడు తనవద్దనున్న జేబురుమాలును దీసి యామెకు విసరుచుండెను ఆ జేబురుమాలే మోహిని పైట చెరగు. అతఁడు పైటచెరగు చించి దానిని జేబురుమాలుగా నుపయోగించి దానితో నామెకు విసరుచుండెను. ఇంతలో మోహిని మరల కనులువిప్పి మోహనుని కైపునకు తనదృష్టి సారించి "మోహనా! నాకుఁ గరి నీసుకుమారహస్తములకు నొప్పిగలిగించుకొనకుము." అని హీనస్వరమున బలికెను.

మోహను డామాట లాలించి విసరుచు "ఆహా! ఈ సాధ్వి పలికిన పలుకొక్కటియు వినిన నాకు దివ్యజ్ఞానము గలుగుచున్నది. హా! పరమేశ్వరా! ఇట్టి పరమసాధ్వ నీ కం టికంత బరువయ్యెనా?" అని మరల మోహిని మోమునకు దిలకించి "మోహినీ! మాటలాడక కొంచెముతడ వుండుము. నీమాతాపితరులకు గబురంపితిని. వారీనాటికి వచ్చు చునేయుందురు" అని యూరడించి మరల నెప్పటియట్ల విస రుచుండెను.

ఆమెకు నిద్దురపట్టునా? ఎట్టివింత! బాధచే నామె యొడ లంతయు విరచుకొనుచుండెను. "మోహనా! బ్రదుక జాల. బాధ—బాధ—ప్రాణము లెగిరిపోవుచున్నవి. అమ్మా సువర్ణమాల! తండ్రీ! విక్రమసేన! మీ వదనారవిందములు

నా కొకసారి జూపుము?" అని పలవరించి మరల మారు మాటాడక మోహనుని తొడలపైపరుండియుండెను. మోహనుడు మొదట భయమొంది మరల ధైర్యకంచుకమును దొడిగికొని యట్లే కూర్చుండియుండెను? ఆహా! ఎంతవిచారకరము!

## ఆ ర వ ప్ర క ర ణ ము.

ఇంతలో నాకస్మికముగా పదుగురు గుమిగూడి చేయు రోదనధ్వని వినంబడెను. దానితోపాటు పదధ్వనియుగూడ వినబడెను. పాపము. మోహనునకంతయు నయోమయముగానుండెను ఇట్టి వీరపురుషుని హృదయమునుంగూడ నిట్టితరి నాకస్మికముగ నొకవిధమగు భయము సహస్రమూర్తుల దాల్చి విజృంభింపదొడంగెను.

కొంతసేపటికి మోహినీమాతాపితలగు విక్రమసేన సువర్ణమాలలు తడబడుచున్నయడుగులతో, కొట్టుకొనుచున్న గుండెలతో బోరుమనేడ్చుచు మూర్ఛితయైయున్న మోహినిచెంతకు వచ్చి "హా. మోహినీ!" యని నిలుచున్న పాటున ధరణిపైకొరగిరి. వారివెనుకనే లలనాజనము. ముందు మాలతి. ఆమెదుఃఖము వర్ణనాతీతము. ఈ దృశ్యమును గాంచుచున్న మోహనునిగుండెలు పటాపంచలైపో

యెను. మాటాడుటకైన శక్తిలేకపోయెను. చూపులయందు భయచిహ్నములు.

హా! పరమేశ్వరా! నీవెచ్చటనుంటివి! ఈభయంకర రోదనాగ్నిజ్వాలలు నామనంబును దహించుచున్నవి. ఏదీ! నీదయారసామృతము నొక్కసారిగురిపించి యీయగ్నిజ్వాలలను చల్లార్పజాలవా? ఏది నీకు కనులపండువుగానున్నదా? హా! ఆపద్బాంధవా! మేము దరమును నీకడుపునపుట్టిన బిడ్డలముగామా! ఇంత కాఠిన్యమును బూన నీకు శ్రేయస్కరమా? ఓ దీనజనసంరక్షణబిరుదాంకితా! ఈదీనులయందు దయదలచవేమి! నియెడ మే మే మహరాధమును గావించితిమి. ఓ! భక్తవత్సలా! జనార్ధనా! పరమపావనా! ఏలపలుకకుంటివి? నాయందు నీకు కోపమా! (అని కొంచెము సేపూరకొని మోహినిని తిలకించి) హా! మోహినీ! ఈనిర్భాగ్యుని కోరి వరించినందులకు నీవేమిఫల మనుభవించితివి? నీకోరిక వ్యర్థమయ్యెనుగదా! త్రిపురసుందరీ! నేనెంతయో ఘనుడనని నీమనంబున దలంచి వరించినందుకు యీమంద భాగ్యుడు నిన్ను చేపట్టి యాదరింపలేకపోయెనుగదా? సఖి! నీవేల పీనుగైతివి? కోరకున్న నీమేన ప్రాణములైన నిలచి యుండునేమో! తరుణీ! ఒక్కసారి నీనయనములు విప్పి నన్ను చూడుము. అమృతములొలికెడు చిలుకపలుకులచే నాచీనుల విందొనర్పుము. నాతో నిక మనసిచ్చిమాటలా

డవా! మోహినీ! అయగో! అటుగాంచుము. నీమాతాపిత లను గాంచుము. మోహినీ! నిన్ను జూచిన సాగరతరంగ ములచాతుప్పన దుఃఖము పొంగి పొరలిపొరలి వచ్చుచున్నది. ఆహా! ఏమి! నీసౌందర్యము- నీరూపలావణ్యములు జూచి యూహా తకునికన్నులు పొడుచుకొనిపోయినవా? సుందరీ! నీ సుందరముఖారవిందమును చూడంజూడ నాహృదయము హిమమునవలె కరగిపోవుచున్నది. (అని శిరముపైకెత్తి) ఓ! పాతవిధీ! దయావిహీనా! ఈపాడునయనముల కెన్నివిపరీత ముల గన్పరచుచున్నావు? ఓ! అష్టదిక్పాలులారా! ఓ! సూర్యచంద్రాదులారా! ఓ! తపోధనులారా! ఓ! భూమ్యాకాశ ములారా! ఈచతుర్దశభువనంబులయందును నావంటి మంద భాగ్యుడుగలడా? (ఆలోచించి) ఆహా! ఏమిది? బేలవై నాపో వుచుంటిని విలపించుట కిది సమయమా? నేనే యధైర్యము నొందిన యీ దంపతులప్రాణములు నిల్చునా? వీరికి ధైర్య ము చెప్పువారెవరు?" అని మరల మోహనుడు ధైర్యమవ లంబించి మోహినినాడిని పరీక్షించెను. అహా! మోహనుని రోదనధ్వనిని వినిన నెట్టి పాషాణహృదయునకైనను జాలి పుట్టకమానదు.

ఇంతలో మూర్ఛమునింగియున్న సువర్ణమాలావిక్రమసేనులు మరల నేడ్చుచు లేచిరి. వారిదుఃఖము వర్ణనాతీతము. కుమార్తెయగు మోహినిని వర్ణించి వర్ణించి దుఃఖం

చుచుండిరి. మోహనుడు వారి నూరడింప ప్రయత్నించెను కాని ప్రయత్నము ఫలింపలేదు. పాపము ? వారి దుఃఖసాగరవీచికాపరంపరల నడ్డగించు పుణ్యాత్ము లెవరైనను గలరా ? అటుగాంచుడు. మోహిని కదలుచున్నది ఏమేమో చెప్పుచున్నది. వినుడు. "అమ్మా ! సువర్ణమాలా ! తండ్రీ ! విక్రమసేనా ! కడసారి—మీ మోము నన్ను గాంచనిండు ?—కడసారి మీ కౌగిలి నాకిండు ? అయ్యో ! నాతల తిరుగుచున్నది. నాతలయే కాదు. భూగోలమంతయు గిరగిర తిరుగుచున్నది. ఇది పగలా ! రాత్రియా ! ఆ ! తెలిసినది. అదుగో ! సింగిపై నిశాచరుడు ఇది రాత్రియే. ఇప్పుడు నే నెచ్చటనుంటిని ? నా పర్యంకముపై నుంటినా? లేక యుద్యానవనంబందుంటినా ? (మోహనుని మోము వీక్షించి) ఇదిగో ! నేను నా ప్రభువు సన్నిధానమందే యుంటిని" అని హీనస్వరమున యేమియో బలికి, దీనముగ తలిదండ్రులవైపు జూచుచుండెను. ఆ చూపులు కఠినహృదయమును గూడ కరగించును.

దంపతులు కన్నీరు కాల్వలుగట్టున నైకరీతిగ నేడ్చుచుండిరి. వారు తమ పుత్రికచెంతకుబోయి యామెకు దమ కౌగిలి నిచ్చిరి. అంత మోహిని తలిదండ్రులచుబుకంబుల బట్టుకొని, ప్రేమాలాపంబుల వారలతో నిట్లనియెను—

"అమ్మా! ఊరడిల్లు మూరడిల్లుము. తండ్రీ! నీవైనను కొంచెము ధైర్యము లేదా? ఇక మీ రెంతదుఃఖించినను యదంతయు నడవిగాసిన వెన్నెలవలె పరిణమించుటయే కాక మీ దేహముల కనారోగ్యము గూడ సంభవించును. అమ్మా! ఎప్పటికైనను నేను మీ యింట నుండవలసినదాననుగాని కూడు దెలియదా? తెలిసియుండియు యేల యీలీల దుఃఖముల పాలయ్యెదరు? జననమరణంబులు మానవులకు సహజమే గదా? ఇక మీరు విచారించుట పాడి గాదు. ఒకటి రెండు రోజులు వెనక ముందు గాని సర్వజనులకును మరణము తథ్యమే!! నాయనా! ప్రతిమానవునకును నూరేండ్లాయువు. కాని జీవుడు ముందు జేసిన పాపపుణ్యముల బట్టి వాని జీవితము క్షీణాభివృద్ధిని బొందునను మహాపురుషుల వాక్యము లాలించలేదా? ముందు నే నే దోష కార్య మాచరించితినో దాని ఫల మిప్పు డనుభవించుచున్నాను. ఓ తల్లిదండ్రులారా! సర్వము నెఱింగియుండియు ని ట్లజ్ఞానాబ్ధిలో మునుంగుట మీకు ధర్మమా? మీకు నేను హితము గఱపునంతటిదానను గాను. కాని యిట్టితరి మీకు మీ యవివేకమును బట్టి చెప్పవలసియుండి చెప్పుచున్నాను. సౌదామినింబోలు యీతుచ్ఛజీవమును శాశ్వతమని తలంచి చరింపరాదు. అమ్మా! తల్లియెవరు? బిడ్డలెవరు? ఇదంతయు మాయగాక మరియేమి? వీరి నమ్మ బని యేమున్నది?

కాన నోమాతాపితలారా! ఇక నన్ను మరచిపొండు. మోహినియను వ్యక్తి మీగర్భమున పుట్టలేదని తలంపుడు. "మాలతి యున్నదిగదా! ఆమెనే మీపుత్రికగా నెంచుకొని, నాకు మీరు గావించు సత్కారములనే యామెకొనర్చుచుండిన మీరు నా వియోగదుఃఖమునుండి గట్టెక్కగలరు" అని తలిదండ్రులకు మోహిని హితోపదేశముచేసి, మరల మాలతిని తిలకించి "సోదరీ! మాలతీ! ఇక నే నేగుచున్నాను. నీవుమాత్రము నాకు మహోపకారము చేయువలసి యున్నది" అనినంతనే మాలతి "అమ్మా! మోహినీ! నీవు విధించు కార్య మెంతకష్టమైనను శ్రమకోర్చి సాధించితీరెద" నని కండ్లనుండి యశ్రుజలంబులు ఫాలభాగముపై బడ మిక్కిలి దీనవదనయై హీనస్వరమున వాక్రుచ్చెను. "సోదరీ! మరేమియు నంత ఘనకార్యము కాదులెమ్ము. రేపటినుండి నీవీ యంతఃపురమున రెండవమోహినివలె సంచరించుచు నాతలిదండ్రులకు గల నావియోగదుఃఖమును దీర్పవలయునని కోరుచున్నాను" అని మోహిని వేడ మాలతి వల్లెయనెను.

అంతయు నిశ్శబ్దము. ఎట్టివిధమైనధ్వనియు వినంబడుటలేదనియే చెప్పవచ్చును. మోహినిహితోపదేశములకాశ్చర్యముసేసిన, సువర్ణమాలలకు జ్ఞాన ముద్భవించుటచే నేడ్పులు చాలించిరి. మోహానుడల్లే మోహినిని తన తొడలపై బరుండబెట్టుకొని విసరుచు గూరుచుండెను. మోహిని

హితోపదేశమున కచ్చెరువందుచుండెను. అంత మోహిని మోహనునిమోముపై చూపుల నిగిడ్చి "మోహనా! నాకు సెలవు దయచేసెదవా ? జీవింపజాల—దుర్భరము—దుర్భరము—ఘోరము—ప్రభువరా! బాధ—భరింపజాల (తల్లి దండ్రులగాంచి) నాతాపితలారా ! మీకుమాత్రము దుఃఖింపకుడు. మీరు దుఃఖించిన నా జీవము—పునాయాసముగ బోవునని కావు. ధైర్యము చిక్కబట్టుడు—ఆపత్కాలమునందు ధైర్యమవలంబించువారికి నిత్యసుఖములు చేకూరును. మీరు కంట తడిబెట్టక యుండిన నేను నా ప్రభువు సన్నిధిని—నామోహనుని సన్నిధిని—నాపరమేశ్వరుని సన్నిధిని—మహాపరిమిత సంతోషముతో నాజీవముల విడచెదను" అని వారికి ధైర్యము చెప్పెను. మరల నామె తన దృష్టిని మోహనునిపై పునకు మరల్చెను.

అతడు పై కేమనవకుండ దుఃఖమును లోలోన మ్రింగుచుండెను. వానికండ్లనుండి స్రవించుచున్న దుఃఖసాగర వీచికాపరంపరలు మోహినిమోముపై వర్షించుచుండెను. అంత మోహిని తన నిజబాహువులచే నాతని కంఠసీమను కౌగిలించుకొని, యాతనివదనముపై తనవదనపద్మమ్మును జేర్చి "మోహనా ! నాకడసారిముద్దిమ్ము" అని యాతని చెక్కుల ముద్దుగొని, యా కౌగిలిలోనే యామె సకలకష్టనివారకమగు దీర్ఘసుఖనిద్రం జెందెను.

ఇంకేమున్నది ? అంతయు నైపోయినది. మోహిని కడవారి పలికిన పలుకింకను మోహనునికర్ణపుటంబుల ప్రతిధ్వను లీనుచుండెను. ఒక్కమారుగా నచ్చటనున్న యంతఃపుర కాంతలయొక్క రోదనధ్వని విజృంభించెను నింగిపై నిశాచరులు వారు జేయుచున్న రోదనధ్వని పని చేయునది లేక వెలవెలబోవుచున్నట్లుండెను మోహనుఁడు వారి నెంత యూరడించినను విఫలమగుచుండెను. ఊరడించినకొలది వారియేడ్పు పెచ్చుపెరుగుచుండెను ఇంతలో తెల్లవారుచున్నదని తెలుపుటకై కుక్కుటంబులు "కొక్కొరో కో" యని కూయదొడగెను. శుకపికంబులు కలకలనాదముచే నంబరవీథి నిండుచుండెను. ఇంకను బాగుగా ప్రభాతము కాలేదు. పాప మా మోహినినిండు ప్రాణము సూర్యునివె న్నెలలో కలసి లీనమైపోయెను.

---

## ఏడవ ప్రకరణము.

---

తెల్లవారి రెండుజాములయ్యెను మోహిని గతించి నన్న దుఃఖవార్త యూరంతయు నలుముకొనెను. ప్రజలందరు దుఃఖసాగరమున మునిగిపోయిరి. మోహనరా వొకగది యందుగల మృదుశయ్యపై బరుండెను. కాని నిద్రపోవలేదు. దీర్ఘాలోచనానిమగ్నుడై యుండెను. తనలో తానే ప్రశ్న

వైచుకొని జవాబులు చెప్పుకొనుచుండెను. " నే నెవరను ? జీవుడను. అటులయిన నాకు తలిదండ్రులుండవలయునుగదా? వా రేమైరి? నే నొంటిగాడనై యుంటినేమి ? పిన్నతనము నుండియు నే నడవిలో దిరుగాడుచుంటినా ? అట్టి సమయమున నీ పుడమితేడు వేటకతంబున నచ్చోటికివచ్చి, నన్ను జూచి నా విలువిద్యకు సంతసించి, నన్ను తన సౌధమునకు దోడ్తెచ్చి రక్షించుచునాఁడా ? నే నరణ్యములో బుట్టితినా? కోయవాడనా యేమి ! నేను వీరియొక్క క్షత్రియుడ నని వంకబెట్టి సంచరించుచున్నాను. నేను క్షత్రియుడనే కాకూడదా ? నిజముగ నేను క్షత్రియుడనే. ఒకవేళ నన్ను చిన్నప్పుడు యెవరైన హంతకులు దొంగిలించి యుండకూడదా ? ఎటులైనను యిప్పటినుండియే నాతలిదండ్రు లెవరో తెలిసికొన ప్రయత్నము చేయవలయును. (కొంచెముసేపూరకొని) ఆహా ! మోహినిచావీ సుందరపురవాసు లందరకు నపరిమితపరితాపము గలిగించినదే ! ఆమె మాతాపిత లన్నపానీయములు విసర్జించిరి. పాపము ! ఉన్న యొక్కకూతురు నూడిపోయెగదా ! (ఆలోచించి) మోహినిరూపలావణ్యముల చూడ రమాసుందరిని బోలియున్నది. ఒకవేళ వీ రిద్దరు నక్కచెల్లెండ్రా యేమి ? ఈరాజు తన కుమార్తెను రామలాలునకు పెంచుకొనుటకై యిచ్చియుండెనేమో ! అట్లు యిచ్చియుండినయెడల తన రెండవప్రాణమగు నాకు జెప్పక

దాచియుంచునా ? ఇందేదో రహస్యమున్నట్లున్నది. కాని మొదల రమామోహనులరూప మెక్కటీరుగా నేలయుండు ను ? కనుక యీ సంశయమును గూడ సాధించి తీర్చుకొన వలయును. ముందుగా విక్రమసేనునే యడిగిచూచెదను” అని స్థిరపరచుకొని శయ్యపైనుండి క్రిందకుదిగి, యా గహ్వ రమునుండి నిష్క్రమించి, రాజు శయ్యాగారమునకు బోవు చుండెను. ఇంతలో వాసికిట్లు “ ఓ ! సూర్యభగవానుడా ? నీ యూహ సరియైనదే!” అని వినంబడెను. మోహనుడు వెనుదిరిగిచూచెను. వా రెవరు ? ఉన్మాదిని. అతడామె చెంత కేగి యిట్లు ప్రశ్నింపమొదలిడెను.

మోహ—నీ వెవరవు ?

ఉన్మా— నేనా ! యాదువారమనుసంగతి నీకు తెలి యదా ?

మోహ— తెలియును ! నీపేరేమి ?

ఉన్మా—నా పేరు నాకే తెలియదు.

మోహ—నీ తలిదండ్రు లెవరు ?

ఉన్మా— నాకు తలిదండ్రులు లేరు.

మోహ—మరి నీ కెవరున్నారు ?

ఉన్మా—సూర్యభగవానుడు.

మోహ—నీవిచ్చట కెందునిమిత్తము వచ్చితివి ?

ఉన్మా—వివాహము చూచుటకు.

మోహ—ఎవరివి వాహము ?

ఉన్మా—పుష్పవరియణము.

మోహను డాశ్చర్యచకితుడాయెను. ఆత డామెమాటల యర్థమును గ్రహించెను. ఏమో యాలోచించుచుండెను. తరువాత నాతడా యున్మాదినిని మరల ప్రశ్నింపఁబోయెను. కాని యామె యచ్చటనుండి మాయమయ్యెను. ఆమె యెట్లు వచ్చినదియు యెట్లు పోయినదియు మోహనునకు కాసింతైనను దెలియలేదు. ఇటునటు పరికించి చూచెను. కాని యా యున్మాదిక గానుపింపలేదు ఆయున్మాదిని యెవ్వరు ?

మోహనుడు నిద్రను సేయని శయ్యాగారమున ప్రవేశించెను. రాజు మృదుశయ్యపై బరుండియుండెను. కండ్లవెంబడి నీరు కారుచుండెను అతడు పుత్రికావియోగదుఃఖసంతాపమున మునింగియుండుటచే వచ్చిన మోహనుని జూడనే లేదు. మోహనుడు నిలువబడియే యుండెను "హా ! పుత్రికా ! మోహినీ ! మమ్ములనిడనాడి యెందుబోయితివి ?" అని రాజు పలవరించెను. మోహను డామాట లాలించినతోడనే యాతనిమనస్సంతయు గలతజెందెను. వెంటనే యాతడు రాజుచెంతకుబోయి "రాజా !" యని చేతితోతట్టి లేపెను. రాజాపిలుపుతో తెలివొంది లేచికూర్చుండెను.

రాజు—మోహనా ! ఏలవచ్చితివి ?

మోహ—మీతీరు జూడగా నేమియు బాగుగ లేదు. మీరిట్లెన్ని నాళ్లు దుఃఖించియైనను మీపుత్రికను రప్పించుకొనగలరా? లేరు. మరెందుల కీ యవివేకము? సరే! మీరొకమారు నాతో రండు పనియున్నది.

రాజు—ఏమిపని?

మోహ—మీరు నాతో వచ్చిన జెప్పెదను.

వారిద్దరునుగలసి విక్రమసేనునియర్థాంగియగు సువర్ణమాల శయ్యాగారమునకు బోయిరి. ఆమె యెట్లున్నది? ఎట్లుండవలయునో యట్లున్నది. మంచముపై పరుండియున్నది. ఏమేమో నిద్రలో పలవరించుచున్నది. మోహను డామె చెంతకుబోయి యామెను "అమ్మా!" యని చేతితోతట్టిలేపెను. "అమ్మా!" యని మోహానుడు సంబోధించుటచే నామె త్రుళ్ళిపడిలేచి "అమ్మా! మోహినీ! మగల నెట్లు బ్రతికివచ్చితివమ్మా?" యని మోహాను నాలింగనము జేసికొనెను. మోహాను డామెను బుజ్జగించుచు "అమ్మా! సువర్ణమాలా! నేను నీ తనూజనగు మోహినిని కాను. మోహనరావును" అని తెలియపరచెను. ఆమె కౌగిలి వదలివైచి "మోహనా! నాప్రభువుతో గలసి యీదినమున నా చెంతకు వచ్చితి వేమి?" అని మోహానుని ప్రశ్నించెను. "అమ్మా! అటుగూరుచుండుము. (విక్రమసేనునితో) మీరుగూడ నచ్చట గూర్చుండుడు. మీతో కొలదిగ మాటలాడవలసినపని యున్నది" అని మోహాను డాజ్ఞాపింప వారట్లనే గూర్చుండిరి.

మోహ—దంపతులారా ! మీ రెన్నినాళ్ళు యిట్లు పవాసముతో నుందురు ?

విక్ర & సువ—మా ముద్దులపట్టిని మరచిపోవునంత వరకును.

మోహ—నామాట లాలించరా ?

విక్రమసేన సువర్ణమాలలు మారుమాటాడక నూరకుండిరి.

మోహ—సరే ! మీరు భుజింపనియెడల నేనేనా సంపూర్తిగా భుజించి తిరుగువాడను ? మీకష్టములు నేను చూడలేను. నే నెచ్చటికైన బోయెదను.

అని మోహనుడు కోపభావమున వెనుదిరిగి గుమ్మము దాటి పోబోవుచుండెను. వెంటనే యా సతీపతు లాపోవుచున్న మోహనుని రెండుకరంబులు నిద్దరు బోయి చటాలున గట్టిగ పట్టుకొనిరి.

మోహ—నన్నెందుల కాపుజేయుచున్నారు ? వదలుడు.

సువ—నాయనా ! మామీద నీకు కోపమా ?

విక్రి—మోహనా ! ఎన్నడును లేని కోపము మామీద నేడేల కలిగెను ?

మోహ—నాకేమియు గోపము లేదు. నన్ను బోవనిండు.

సువ—నాయనా! నీవుకూడ మమ్మువిడచి పోయె దవా?

మోహ—మరెందులకు? మీరు భోజనము చేయరు. మీరు చేయనంతకాలము నేనుగూడ భోజనము చేయను. ఇందువలన మనకు లభించునానెయులు లభించునా? కావున మీరు భుజించినరోజున నాకు కబురంపుడు నే నప్పుడు వచ్చెదను.

సువ—తండ్రీ! నీవుకూడ విడచిపోయినచో మే మొక్కత్రుటికాలమైనను జీవింపగలమా? బాబూ! నన్నే మేము నమ్ముకొనియుండ మమ్ములను బాయుట ధర్మమా?

మోహ—అమ్మా! మీరు భుజింపకుండ నుండుట ధర్మవిరుద్ధము కాదా?

సువ—బాబూ! నీవు పోవలదు మేము భుజించెద మురమ్ము.

మోహ—అట్లైన నాకును సమ్మతమే.

అంత నాముగ్గురు నొక వింతమందిరమును జేరి అచ్చట కొలదిగ భుజించిరి. మోహనుడు రాణితో "మాలతిగూడ నుపవాసముండెనా?" అని యడిగెను.

సువ—ఆమెయుగూడ నుపవాసమున్నది.

మోహ—సరియే! బాగుగ నేయున్నది.

మోహానుడు, మోహినిచెలికత్తెయగు తరళను బిల చి "నీవుపోయి మాలతి నిటకు తీసికొనిరమ్ము" అని యా జ్ఞాపింప నామె వెడలిపోయి మరల కొంతసేపటిలోనే మాల తి నచ్చటకు దోడ్కొనివచ్చెను. సువర్ణమా లామెనుగాంచి "అమ్మా! మాలతీ! కొంచెము ఫలహారముజేయవా?" యని యడిగెను. "మీ యందరిఫలహారము లైనయెడల నే జేయుట కభ్యంతర మేమున్న" దని సవినయముగా బలికెను. అందరిఫలహారము లయినవని తెలియుగానె మాలతి గూడ కొంచెము భుజించి సువర్ణమాలపజ్జను గూరుచుండెను.

మోహా—ఇప్పటికి నా మనసు చల్లబడినది. మీ రం దరు నుపవాసముండి యెవరినుద్ధరింప దలంచితిరో కాని—

విక్ర—మోహానా! ఏమో నాకు చెప్పెదనంటివి?

మోహా—చెప్పెదరండు.

అచ్చటనుండి విక్రమసేన మోహానరాజులు వెడలి పోయిరి.

---

## ఎనిమిదవ ప్రకరణము.

---

రాజుగారి శయ్యాగారములో రాజును మోహానుడు గూర్చుండి యీ క్రిందివిధముగ సంభాషించుచుండిరి.

మోహా—రాజా! హంతకుడు దొరకినాడు.

రాజు—ఎవఁడు వాఁడు ?

మోహ—మీ మోహానిని జంపిన హంతకుఁడే.

రాజు—నిజముగ దొరకినాఁడా ? నా డెచ్చటనున్నాఁడు ?

మోహ—చెఱసాలయందు.

రాజు—అటులయిన నీ విచ్చటనే యుండుము. ఆ పాపిని ఖండఖండలుగ జీల్చివైచి కాకులకు, గ్రద్దలకు నెగురవైచి నా పరితాపము దీర్చుకొనెదను.

మోహ—రాజా ! శాంతింపుము. వానికి దగిన ప్రాయశ్చిత్తమైనది. పగవాఁ డసహాయుఁడై యున్నప్పుడు వానిసి జంపుట రాజధర్మముగాదు.

రాజు—వానిని గొన్నిచీవాట్లను పెట్టివచ్చెదను.

మోహ—ఇప్పు డెందులకు. రే పుదయమున మన మిద్దరము గలసి పోవుదము.

రాజు—సరే ! అటులయిన నీ యిష్టము.

మోహ—రాజా ! మిమ్ము నొక టడిగెదను. దానికి మీరు చీకాకుపడక సదుత్తర మీయవలయు నని నాకోరిక.

రాజు—మోహనా ! నీవు నావద్ద యేప్రశ్న నైన నిరాటంకముగ నడుగవచ్చును.

మోహ—మోహినికిముందు నీకు బిడ్డలుగలిగిరా?

రాజు—నీకీసంశయ మేలజనించెను ?

మోహ—కొండొక కారణమున.

రాజు—ఆ కారణమేమిదో యిప్పుడు చెప్పకూడదా?

మోహ—ఇప్పుడు మీతో జెప్పుట నా కిష్టము లేదు.

రాజు—మరెప్పుడు జెప్పెదవు?

మోహ—కార్యానుకూలమైనతరువాత. ముందు నా ప్రశ్నకు జవాబీయుము?

రాజు—మోహినికిముందు సంతానము గలిగినది.

మోహ—ఎందఱు?

రాజు—ఒక బాలికమాత్రమే—

మోహ—(తనలో) మోహనా! నీయూహ సరియైనదే. ఇందంతయు మాయవలె గాన్పించుచున్నది. (ప్రకాశముగా) రాజా! ఆ బాలిక యేమైనది?

రాజు—(విచారముతో) నాయనా! ఏమని చెప్పుదును? మొదటినుండియు నా యదృష్టమంతయు నిట్లేయున్నది.

మోహ—చెప్పుడు. ఆ బాలిక యేమైనది?

రాజు—జన్మించిన సంవత్సరమున కాబాలికను తూగుటుయ్యాలలో బరుండబెట్టి దాదులను కాపుంచితిమి. ఆ రాత్రి కొంతమందిహంతకు లీ సౌధమునందు ప్రవేశించి, కాపున్న దాదులను హతమార్చి, నిదురించుచున్న యాబాలికను... ... ... ... ...

రాజిక మాటలాడజాలకపోయెను. వానికండ్లశ్రు జలపూరితములాయెను. కంఠము రుద్ధమాయెను.

మోహా—రాజా! ఆ బాలిక రూప రేఖావిలాసం బుల సూచించుఛాయాపటముండిన దాని నొకసారి నాకు చూపింపుడు?

రాజు—నాయనా! అంతయదృష్టమా! అదియును గూడ లేదు.

మోహా—మీ యమ్మాయి నానవాలు పట్టుట కేమైన గుర్తులుగలవా?

రాజు—ఉన్నవి. కుడియరచేతియందు చిన్న మచ్చ గలదు. అది ముఖ్యమైనది. ఇంకను కొన్ని గలవు. అవన్ని యు కాగితముపై వ్రాసి పెట్టెలో నుంచితిని.

మోహా—ఒక్కమారు నాకవి జూపింతురా?

రాజు—అదిగో! ఆ కనబడుచున్న పెట్టెయందేయున్నది. తాళములిగో. కాని యవన్నియు నిప్పు డెందులకు?

మోహా—అత్యవసరమైనపని యున్నది.

మోహానుడు తాళములను పుచ్చుకొని పేటికను దెరచెను. అందేమున్నవి? కొన్ని ఛాయాపటము లున్నవి. మరి కొన్ని కాగితములున్నవి. మోహానుడు బాలికయానవాళ్ళు గల కాగితమును బయటకుదీసి చదువుకొనెను. కాని యందుగల గుర్తులేమియు వానికి రుచించినవి కావు. అరచేతిమీద

మచ్చయను గుర్తునే యాత డాధారముగా గొని యా కాగి తమును తన జేబునం దిడుకొనెను తరువాత నాత డాపెట్టె లోనున్న ఛాయాపటముల జూడసాగెను. మొదటిది—విక్ర మసేనుడు; రెండవది—సువర్ణమాల ; మూడవది--మోహిని నాల్గవది—అపరిచితుడు. కాని రాజు. మోహనుడాపట మును బాగుగ పరిశీలింప నారంభించెను. ఆశ్చర్యనిమగ్నుడగు చుండెను. అతడు "రహస్యమంతయు నగాధమై పోవుచున్నది. మా యనుమితి మీరుచున్నది. ఈపటమునందున్న పురుషుడు నిక్కముగా రామలాలునే పోలియున్నాడు. నిజముగ నీతడు రామలాలేనా ? ఎట్లగును. రామలాలు వర్తకుడు. ఈపట మున నున్న పురుషుడు రాజు మనుజుని పోలిక మనుజు లుం దురు వీని రామలాలని నమ్మబని యేమున్నది ? కాని రూపుమాత్రము రామలాలుదే. సరే ! యీత డెవరైనదియు రాజు నడిగిన తెలియును" అని మోహను డాచిత్రఫలకమును రాజునకు జూపించెను.

మోహ—రాజా ! ఈ చిత్రఫలకమందుండిన యీ రాజెవ్వరు ?

రాజు—నాయనా ! పూర్వగాథ లన్నియు బయట పెట్టుచున్నావా ?

మోహ—మరేమియును భయములేదు. ఈ రాజె వ్వరు ?

రాజు—యువరాజు.

మోహ—అనగా ? నా కర్థముకా లేదు.

రాజు—నా సహోదరుని ఛాయాపటము.

మోహ—(తత్తరముతో)మీకు సహోదరుడుండెనా? ఆత డెచ్చటనున్నాడు ?

రాజు—ఎచ్చటికో బోయినాడు.

మోహ—ఎట్లు ? సవిస్తరముగ దెలుపుడు ?

రాజు—తెలుపుట కేమున్నది ? నాతో జగడమాడి వెడలిపోయినాడు.

మోహ—అతని నామధేయమేమి ?

రాజు—జయసేనుడు.

మోహ—అతని యర్ధాంగి నామధేయమేమి ?

రాజు—చంద్రవదన.

మోహ—ఆమె ఛాయాపట మిచ్చటనున్నదా ?

రాజు—ఆపేటికలో రెండవయరయందున్నది.

మోహనుడు రెండవయరనుగూడ దెరచి దానియందున్న ఛాయాపటమును బయటకుదీసి చూచెను. ఏమైనది ? రహస్యమంతయు బయటబడినది. ఆఛాయాపటమునందున్న స్త్రీమూర్తి రామలాలుగారి గృహిణియగు సరళను బోలియున్నది.

మోహా — రాజా! ఈ రెండుఛాయాపటములును నా వద్దనుండనిండు. వీనితో కొంచెగపనియున్నది. మీరుమాత్రము నన్నాపనేమని యిప్పుడు ప్రశ్నింపవలదు.

రా జంగీకారసూచకముగా తలనూచెను. మోహనుడు మరల పెట్టెలోనున్న కాగితముల నన్నియు పరిశీలించుచుండెను. అందొక కాగితమును విప్పిచూచెను. వెంటనే స్తంభితుడాయెను. ఆశ్చర్యనిమగ్నుడయ్యెను. "ఆహా! ఈవిక్రమసేనుని యొద్ద చాల రహస్యములున్నవే!" అని యాతడా కాగితమును తనలో చదువుకొనెను. దానియం దిట్లున్నది.

"విక్రమసేనమహారాజా! మీ పాదపద్మముల సన్నిధికి:—

ఈదినమున మాతండ్రిగారు నన్నితరదేశములకు దీసికొనిపోవుచున్నారు. కాన నాయందు కృపామతి నూహించి వారముదినములు సెలవుదయచేయగోరుచున్నాను.

ఇట్లు,

మీవినయవిధేయుడు,

శ్యామలరావు."

"హంతకుడే రాజుయొద్ద కొలువుండెనా? ఆహా! ఏమి వాని ధైర్యసాహసములు!" అని యనుకొని మోహనుడు రాజువైపునకు దిరిగి "రాజా! ఈయుత్తరమును పరీక్షింపుడు" అని యాయుత్తరమును రాజున కిచ్చెను. రాజు దానిని చదువుకొనెను.

రాజు—ఇప్పుడు దీనితో మనకేమిపని ?

మోహా—శ్యామలరా విప్పుడు మీయొద్ద పనిచేయు చున్నాడా ?

రాజు—లేదు

మోహా—ఏమి ?

రాజు—పదువాలుగేండ్లక్రిందటనే మానివేసి పోయి నాడు.

మోహా—మీవద్దనున్నప్పు డాతనినడవడిక యెట్లుం డెను ?

రాజు—అప్పటికి వాడు చాల పిన్నవయస్కుడు.

మోహా—వయస్సెంతయుండును ?

రాజు—ఆరేండ్లో యేడేండ్లో యుండును.

మోహా—రాజా ! ఆ పిన్నవయస్కుడే యిప్పుడు మనకు భయంకరకృత్యముల జూపుచున్న మాయదొంగ.

రాజు—(కంగారుతో) వాడేనా ? మోహానా ! వాడేనా ?

మోహా—అందుకు సందేహమా ?

రాజు—ఆహా! పామునకే పాలుపోసితిని.

మోహా—రాజా ! అయినదేదో యయినది కానున్నది కాకమానదు. ఇప్పుడు విచారించిన లాభము లేదు. ఇక వానిని బట్టవలయును.

రాజు—వానిని బట్టుటెందులకు ?

మోహ—రమాసుందరికొరకు అందువలన మీకును లాభమే.

రాజు—మోహనా ! నాకేమిలాభము ?

మోహ—తత్తరపడకుము. లాభమంతయునుమీదే.

రాజు—అదేదో నాకుజెప్పవా ?

మోహ—క్షమింపుడు. ఇప్పుడు నేను చెప్పదలచుకొనలేదు.

రాజు—ఏమో ! నీమాటలన్నియు నాకు వింతగొలుపుచున్నవి.

మోహ—నామాట లేగాదు. సర్వమును వింతయే !

రాజు—మోహనా ! ఎప్పుడడిగినను "యిప్పుడుచెప్ప" నందు వేమి ?

మోహ—అంతయు నొక్కమారే తెలిసికొనుటకు.

రాజు—సరే ! నీయిష్టము—

మోహ—నాకు సెలవుదయసేయుడు. పనియున్నది.

రాజందులకు సమ్మతింప మోహనుడు తన యిచ్ఛారీతి నెచ్చటకో బోయెను.

---

# తొమ్మిదవ ప్రకరణము.



మధ్యాహ్నము రెండుగంటలాయెను. ప్రభాకరుని ప్రచండకిరణములు ధరణిపై బడి జగజ్జేగీయమానముగ ప్రకాశించుచుండెను. మోహనుడు విక్రమసేనుని ప్రధానమంత్రియగు జయవర్మగారి గృహాభిముఖుడై పోవుచుండెను. పోవునప్పుడాతడు మాటిమాటికిని తలపంకించుచుండెను. చేతఛాయాపటమును పలుమారు చూచుకొనుచుండెను. మరల నాతడాలోచనానిమగ్నుడగుచుండెను నడకమాత్రము మానలేదు. కొంతసేపటికాతడు జయవర్మగారిగృహము నొద్దకు బోయెను. ఏలకోకాని యాగృహము తలుపులన్నియు బంధింపబడియుండెను. గుమ్మమువద్ద నిద్దరు యువకులు కూర్చుండి గుసగుసలాడుకొనుచుండిరి. మోహనుని గాంచగనే వారు లేచి నిలువబడి "అయ్యా! మీరెవరు?" అని ప్రశ్నించిరి.

మోహ—నాపేరు మోహనరావు. జయవర్మగారింటియందున్నారా?

ఒక—ఉన్నారు ఇంటివారందరును విచారకరముగానున్నారు.

మోహ—కారణము?

రెం—రాత్రి యెవరో దొంగలు ప్రవేశించి వారి యమూల్యవస్తువొకదానిని తస్కరించిరట. అందువలన విచారముగా నున్నారు.

మోహాను డాశ్చర్యము నొందలేదు. దొంగ లెవరాయని తనలో ప్రశ్నించుకొనలేదు. కాని తనలోతాను నవ్వుకొనెను. ఆతడు వారిని తలుపుతెరువ నాజ్ఞాపింప తలుపుదెరచిరి. మోహానుడు తనయొద్దనున్న పటమును కోటునందు గుప్తపరచి లోనికిబోయెను. అచ్చట నంతయు నిశ్శబ్దమై యుండెను. తలుపు లన్నియు తెరచియే యుండెను. ఎవ్విధమైనసవ్వడియును లేదు. ఆతడు నిర్ఘాంతపడిపోయెను. ఏమియును దోచుటలేదు. నిలుచున్నచోటనేశిలాప్రతిమవలె నిలువబడియుండెను. నలుకెలంకుల గలయజూచెను. అతనికేమియు దృగ్గోచరము కాలేదు. తలుపులన్నియు తెరచియుండుటచేత విస్మయమునస్కుడై చరచరలోనికిబోయెను. వెంటనే భయవిహ్వలుడాయెను. అతడు రెండడుగులు వెనుకకువైచి నిలువబడిపోయెను.

ఆ గదియందు నలుగురు నాలుగు మంచములపై బంధింపబడియుండిరి. వారిలో యిద్దరు మగవారును, యిద్దరు యాడువారు నుండిరి. వారికి నిజముగా మతి లేదనియే చెప్పవచ్చును. పాపము మోహాను డాభయంకరదృశ్యమును గాంచి నిర్విణ్ణుడాయెను. అతడు నలుగురియొద్దకు బోయి

వారి ముక్కులపై జేయివైచి, శ్వాసయాడుచున్నదో లేదో యనిచూచెను. శ్వాస యాడుచునేయుండెను. ఇంకను వారు సజీవులై యుండిరని యాతడు గ్రహించెను. తోడనే యాతడు తన జేబునుండి యదొకవిధమగు పసరుసీసాను బయటకు దీసి వారలకు వాసనచూపెను. వారి కట్లను విదల్చెను. కాని యింకను వారికి తెలివి గలుగలేదు.

మోహనుడు ప్రక్కనున్న సోఫాయందు గూర్చుండెను. ఈదారుణకృత్యమున కెవరొడిగట్టిరా యని చింతించుచు గూరుచుండెను. స్త్రీ లిద్దరిలో పిన్నవయసుగలది జగదీశునిభార్యయని యాతడు తెలుసుకొనెను. ఆమె మిక్కిలి సుకుమారగాత్రి—పద్మవిశాలనేత్రి—పసిండిచాయచే వెలుగొందు యామె మృదుశరీరము త్రాళ్లచే బంధించుటచే యెఱ్ఱనై కందియుండెను. ఆమెను ఆయింటి ధనలక్ష్మియే వచ్చి యాశయ్యపై నిదురించుచున్నట్లాతనికి దోచెను.

మోహను డట్లేగూర్చుండియుండెను. అతని యాలోచనలకంతము గానరాకుండెను. అతడేమియు జూచుటలేదు. శిరముమాత్రము పైకెత్తి యుండెను. ఇంతలో జగదీశుని యర్ధాంగి శయ్యపైనుండి నెమ్మదిగ క్రిందికిదిగి వెఱ్ఱిచూపుల జూచుచుండెను. ఆమెకింకను మత్తు బాగుగా వదలలేదనియే చెప్పవచ్చును.

మనస్సు మనసులో లేదు. ఆమె యడుగులలో సడుగు లిడుచువచ్చి మోహనుని వెనుక నిలుచుండెను. అత డామెను చూడలేదు. ఆమె మోహనునిభుజములపై తనరెండు చేతులను వెచి "నాథా! హంతకుడు వెళ్ళిపోయినాడా?" అని హీనస్వరమున ప్రశ్నించెను ఆ స్వరమునందు భయముకూడ పొడకట్టుచుండెను.

ఆ పిలుపునకు మోహను డదరిపడెను అతని చింతా సూత్రము విచ్ఛిన్నమాయెను. వెనుదిరిగి చూచెను. "ఎవరు వార"ని తనలో ప్రశ్నించుకొని "జగదీశునిభార్యయే" యని జవాబుచెప్పుకొనెను. సోఫాపైనుండి లేచి నిలువబడెను.

మోహ—అమ్మా! నేను నీప్రాణప్రియుడగు జగదీశమహాశయునిగాను. విక్రమసేనమహారాజుయొక్క మొదటిసైన్యాధిపతిని.

యువ—ఏమీ! మీరు నాతో పరిహాసములాడుట కిదిసమయమా?

మోహ—అమ్మా! నేను నిజముగా జగదీశునికాను. అదుగో! ఆత డామంచముపై మత్తుచే పరుండి యున్నాడు. పిచ్చిభ్రమలు చెందకుము. (తనలో) ఈమె కింకను మత్తు వదలనట్లున్నది.

ఆయువతి మత్తుమందుచే మైమరచి మంచముపై పరుండియున్న జగదీశునిమోము పరికించెను. మరల మోహనుని

చెంతకువచ్చి యాతని మోమునుగూడ బాగుగా పరికించెను. వెంటనే యామె యాశ్చర్యమానసురాలయ్యెను. మోహను నికి పదియడుగులదూరములో నిలువబడి యామె "ఆహా! ఈ యిద్దరిలో నానాథుడెవరు? సోఫాపై గూర్చున్న యువకుడా? లేక శయ్యపై పరుండియున్న యువకుడా? వీ రిద్దరిరూప రేఖావిలాసంబు లొక్కమాదిరిగా నున్నవి. మరియును సమాన వయస్కులు. ఈయువకుని మాటలవలన మంచముపై నున్న సుందరుడే నా భర్తయని తెలియుచున్నది. ఇతఁడు విక్రమ సేనసైన్యాధిపతియగు మోహనరావా? హా! హా! నా నాథుడనుకొని యీమోహనుని "నాథా" యని పిలిచితినే; నే నెంత మూర్ఖురాలను—ఎంత మందమతిని—ఆహా! ఎంత యకార్యం బాచరించితిని. (ఆలోచించి) జరిగిన దేమో జరిగిపోయినది. అందునిమిత్త మాతని నే క్షమార్పణ కోరెదను" అని యా యువతి మోహనుని చెంతకు బోయి. యాతని కెదురుగా మోకాళ్ళపై గూర్చొని, పాదంబులను బట్టుకొని, భూమిపై తనముంగురుల బరపి మృదుమధురస్వరంబున "సోదరా? నేను నీయెడ గావించిన యపరాధమునకు క్షమార్పణ గోరుచున్నాను" అని మోహనుని వేడు కొనెను. మోహనుఁ డామెను లేవనెత్తి "సోదరీ! నీవు నా యెడల నేమియపరాధమును గావించితివమ్మా!" యని నవిన యముగ బలికెను.

యువ—సోదరా! నా తప్పు క్షమించితివనుకొనుము.

మోహ—క్షమించితిని.

---

## పదియవ ప్రకరణము.

---

కొంతవడి నా ముప్పురును గూడ లేచి గూర్చుండిరి. భయముచే వారు మోహనునిదెస నదేవిధమున జూచుచుండిరి. జయవర్మగారి గృహిణియగు ప్రభావతి తన కోడలిని జూచి "అమ్మా! వసంతసేనా? ఆయువకు డెవరమ్మా?" యని ప్రశ్నించెను.

వసం—అత్తా! ఇంకెవరు? మన కష్టములను గట్టెక్కించవచ్చిన మనపాలిటి కల్పతరువు. డిటెక్టివు మోహనరావు.

వసంతసేన తన యత్తగారిని వెంటబెట్టుకొని లోనికి బోయెను. తరువాత నా ముప్పురుపురుషులకు నీ క్రిందివిధముగ సంభాషణ జరిగెను.

మోహ—జయవర్మగారూ! నే నిచ్చటకు రానియెడల మీ రందరు బలవన్మరణ మొందవలసినవారే. మీ రలీలుల బంధితులై పడియుండిరి?

పాపము జయవర్మగారికి భయముచే కాలుచేతులు కంపించిపోవుచుండెను. మోము కళావిహీనమై నల్లబడిపోయెను. మోహనునిపై ప్రసరింపజేసిన యాతనిదృష్టులు

చలించుటలేదు. ఆ చూపులయందు భయచిహ్నములు చూ పట్టుచుండెను.

మోహను డాచర్యనంతయు బాగుగ గమినించుచునే యుండెను. కొంతసేపటికి జయవర్మ మిక్కిలి ప్రయాసతో కొంచెము ధైర్యము దెచ్చుకొనెను.

జయ—మహాశయా! క్షమింపుము. నన్నిపుడేమియు ప్రశ్నింపవలదు. ఏలకో కాని నాతల తిరుగుచున్నది. ఏమియు నావగింజంతయైనను చెప్పజాలను. వలయునెడ నాకుమారుని ప్రశ్నింపుము. సర్వమును విశదముకాగలదు. (జగదీశుని జూచి) అబ్బాయీ! ఇప్పటికైనను నామాట లాలించి మన గుట్టంతయు నీ మహాత్మున కెఱింగింపుము. శుభముచేకూరును. కొంచెమైనను దాచవలదుసుమా?

ఆ యమాత్యు డట్లే చెంపను చేయిజేర్చుకొని దీర్ఘాలోచనానిమగ్నుడాయెను. జగదీశుడు తండ్రిమాటకు మొదట భయమొంద సాగెను. జయవర్మగారి మాటలయర్థమును మోహానుడు గ్రహింపజాలకశిరముపైకెత్తియాలోచన సభినయించెను. లెక్కలేనియూహ లాతని చుట్టుముట్టెను. కాని యం దొక్కటియైనను నిలచి యాతని మనస్సునకు శాంతి నిచ్చినదికాదు.

మోహ—జగదీశమహాశయా! మిమ్ముల మీతండ్రిగారేదియో యాజ్ఞాపించినారు. నాయందు దయయుంచి యుంచుక సెలవీయ గోరుచున్నాను.

జగ—బాబూ! హంతకుల భయంకరకృత్యములకు తాళజాలకున్నారము. ఘడియఘడియ గండమే! అంతయు నెందులకు ముఖ్యమైనసంగతి వినుడు. రాత్రి మాయింట దొంగలుపడి మాయమూల్యవస్తు వొకదానిని తస్కరించుకొని పోయినారని మేమందరమును విచారముతోనుండగా "గోరుచుట్టుపై రోకటిపోటు" న్నట్లు మరల హంతకులుప్రవేశించి మాకీబహుమతి నొసంగి వెడలిపోయినారు. మోహనా! ఇంకేమున్నది? మాయవస్థ యిట్లున్నది

మోహ—సరే! జగదీశ్! నిన్నిపుడు కొలదిగ ప్రశ్నింపవలసియున్నది. సరియైనజవా బిచ్చెదవా?

జగ—నాకు దెలియునంతవరకును—

మోహ—ఇప్పుడు నీవు నాతో రాత్రి మీయింట దొంగలు పడిరని చెప్పితివిగాదా?

జగ—చెప్పితిని, నిజమే.

మోహ—అమూల్యవస్తు వొకటి పోయినదనికూడ చెప్పితివి.

జగ—ఔను. నేనుమాత్రము లేదంటినా?

మోహ—అమూల్యవస్తు వంటిరిగదా? అనగా నేమియో నాకు దెలియ లేదు.

జగ—దానినామముతో మీకేమిపని?

మోహ—కాలలసినంత పని యున్నది. దానిని యత్నించి పట్టుకొనుటకు.

జగ—ఛాయాపటము.

మోహనుని యానంద మపరిమితమయ్యెను. అతని కష్టములు గట్టెక్కు—కాల మాసన్న మగుచుండెను. అతని ప్రయత్నము లన్నియు ఫలించుచుండెను. "వీరి యమూల్యవస్తువు ఛాయాపటమట! వీరి కదియమూల్యవస్తు వెట్లయినది? పటములోనున్న ప్రతిమ రమాసుందరియే యైన వీరికది యమూల్యవస్తువే యగును. ఎందువలనన, వీరు చిన్నతనమునను రమాసుందరిని దొంగిలించి రామలాలునకు పెంపకమున కిచ్చియుండిరి. ఆయువతిఛాయాపటము వీరియొద్ద నుంచుకొనిరి కాబోలును. ఆపటము యితరుల కంటబడిన వీరికి ప్రమాదము వచ్చును. అందువలన వీరికి రమాసుందరి ఛాయాపటము యమూల్యవస్తువైనది. పాపము! దానినెవరో దొంగిలించిరి. ఎవరోయననేమి? నేనే. (ఆలోచించి) నాయొద్దనున్న ఛాయాపట మెవరిది? రమాసుందరిదా? లేక మోహినిదా? ఇది మోహిని ఛాయాపటమేయైనచో వీరి కమూల్యవస్తు వెట్లగును? పటముపోయినను వీరు భయరహితులై యుండవలసినదే! ఇది మోహినిఛాయాపటము గాదు. మఱెవ్వటికిని గాదు. ఇది రమాసుందరి ఛాయాపటమే! రహస్యమంతయు నీజగదీశుడు కప్పిపుచ్చుచున్నాడు.

అని పరిపరివిధముల చింతించి మరల మోహనుడు సంభాషణ కుపక్రమించెను.

మోహ—ఛాయాపటమా ? ఎవరిది ?

జగ—ఏమో ! నాకు దెలియదు.

మోహ—పటమును చూచిన చెప్పగలవా ?

జగ—ఉన్న యెడలగదా ! చెప్పుటకు.

మోహ—సరే ! అటులయిన పటమును చూపెద నుండుము.

మోహనుడు జేబునందున్న ఛాయాపటమును బయటకుదీసిదానిని జగదీశుని చేతియం దిడెను. దానిని చూచుటతోడనే జగదీశుడు భయభ్రాంతుడాయెను. మోము వెలవెలబోయెను. జగమెల్ల నాతనికి కారుచీకటులు గ్రమ్మినట్లుండెను. తదేకదృష్టితో నాతడాపటమును దిలకించుచుండెను. మాట లేదు.

మోహ—ఆఛాయాపట మెవరిది ?

ఇంతవరకును పరధ్యానముగా గూర్చున్న జయవర్మగారు "ఛాయాపట" మని వినంబడుటతోడనే త్రుళ్ళిపడిలేచి "బాబూ! ఏదీ! ఏదీ ! ఛాయాపటమేదీ ?" అని తత్తరపడసాగెను. వెంటనే మోహనుడాపటమును జగదీశునివద్దనుంచి తీసికొని దానిని జయవర్మగారికిచూపించెను. బాబూ! ఇదే. ఇదే. ఈపటమే. "మోహనా ! ఇదెట్లువచ్చినది ?" అని ప్రశ్నించెను.

జగ—మహాశయా ! ఇది మీకెట్లులభించినది ?

మోహ—తరువాత చెప్పెదను. కాని యీ ఛాయా పటమెవ్వరిది ?

జగదీశుడు కొంతతడ వాలోచించెను. ఎట్లయినను చెప్పక తప్పదు. ఇది మోహాని ఛాయాపటము.

మోహ—నమ్మబని లేదు.

జగ—ఏమి ?

మోహ—ఏమా ? కాదుగనుక. తెలిసినదా ?

జగ—మీరు నమ్ముడు. నమ్మకపోండు. దానివలన మాకేమినష్టము ? ఇది నిక్కముగా మోహిని ఛాయాపటము. మరియును నూ యమూల్యఛాయాటపము.

మో—ఎవరిదో నిజముదెలుపుడు. ఏలవృథాగా కష్టముల పాలయ్యెదరు ? ఇది మోహినిచాయాపటముగాదు. ముమ్మాటికిని గాదు.

జగ—బాబూ! ఇది నిక్కముగా మోహినిచాయాపటమే.

మోహ—దానిమాటకేమిగాని నేను మిమ్ము కొన్ని ప్రశ్నలవైచెదను. వానికి త్వరితముగా జవా బిచ్చుచుండవలయును.

జగ—సాధ్యమైనంతవరకు—

మోహ—నీవువిక్రమసేనునితో యిచ్ఛాలీలముచ్చటింతువా ?

జగ—ఆ ! ముచ్చటింపకేమి ?

మోహ—మోహినితో నీ వెప్పుడైనను మాటలాడితివా ?

జగ—పెక్కుసారులు మాటలాడితిని.

మోహ—అట్టిసమయమున విక్రమసేనుడుండిన ?

జగ—ఉన్నప్పుడుకూడాను—

మోహ—రాజనిన నీకు భయముండెడిదా ?

జగ—లేదు.

మోహ—అట్లయిన నిజముచెప్పుము. నీకు రాజనిన భయములేనిచో, మోహినిఛాయాపటమును చోరు లెత్తుకొనిపోయిరిగదా ? మీ కిప్పుడు భయమేలగలిగెను ? అది మీ కమూల్యవస్తు వెట్లయినది ?

జగదీశుడు మరి మాటలాడజాలకపోయెను. ఏమిచెప్పుటకును తోచుటలేదు. తన రహస్యమంతయు మోహానునకు తెలిసిపోయెనని తలంచెను. ఇంక దాచుటవలన లాభము లేదని స్థిరపరచుకొనెను. ఇంతలో సేవకు డొక లేఖను పట్టుకొని ద్వారమువద్ద వేచియుండుటను మోహానుడు గాంచి యా లేఖనందుకొని దానిని తనలో చదువుకొనెను. దాని యం దిట్లున్నది.

"(శ్రీ)రాజా విక్రమసేన ప్రధానమంత్రియగు
జయవర్మగారి సన్నిధికి—

మీ యాజ్ఞాప్రకారము చెట్టులనక, పుట్టలనక, రాళ్ళు రప్పలనక, రాత్రింబవళ్ళనక, అడవులు, కొండలు, మడువులు సమస్తమును తిరిగి తిరిగి వెదకి వేసారితిమి గాని మీరు చెప్పినయానవాళ్ళు మొదటిది-దక్షిణహస్తము చిటికెనవ్రేలి గోరు సింధూరవర్ణముదాల్చియుండుట. రెండవది—వీపుపై కుడిపార్శ్వమున నొక్కచోటుననే మూడు పుట్టుమచ్చలున్న మీ కుమారు డెచ్చటను గానరాలేదు.

ఇట్లు
నీ ప్రియమిత్రుడు
నారాయణదేవ్"

ఆ యుత్తరము మోహనరావున కర్థముగాలేదు. కాని దానియందు లిఖించియున్న యానవాళ్ళుమాత్ర మాతనికి సరిపోయెను.

మోహ—జయవర్మగారూ! ఇవి మీ కుమారుని యానవాళ్ళా?

జయ—ఔను! నాయనా! నా రెండవకుమారుని యర్ధరాత్రమున దొంగ లెత్తుకపోయినారు. అప్పటికి వాడు రెండేండ్లపిల్లవాడు. ఇప్పుడా బాలుని వెదకించుచుంటిని. కాని లాభము గానుపించుటలేదు.

మోహను డాలోచనానిమగ్నుడయ్యెను. "నా తలిదండ్రులు జయవర్మ ప్రభావతులే యనుటకు సందియము లేదు. ఈ లేఖయందు చెప్పిబడిన రెండుయానవాళ్ళును నాకు సరిపోయినవి" అని యాతడు తలంచెను.

మోహ—జయవర్మగారూ! మీ కుమారుని చోరులు తస్కరించి యిప్పటి కెన్నిసంవత్సరము లైనవి?

జయ—రమారమి—పదునెనిమిదిసంవత్సరములు.

మోహానునికి కండ్లజల మూగినదికాదు. అతడు జయవర్మను మతిచలించినవానివలె చూచుచుండెను. జయవర్మ కూడ మోహనుని తదేకదృష్టితో జూచుచుండి మరల నాతని దక్షిణహస్తము చిటికెనవ్రేలి గోరును పరీక్షించెను. అదెట్లున్నది? సింధూరవర్ణము దాల్చియున్నది. ఇద్దరు నా చూపులతో నెమ్మదిగ లేచి నిలువబడిరి. కాని వారికాళ్ళు కంపించి పోవుచుండెను. ఈదృశ్యమును గాంచుచున్న జగదీశుడు నివ్వెరపడెను. అతడుగూడ లేచి నిలువబడెను.

జయ—(మితిలేని దుఃఖముతో) కుమారా! మోహనా!

మోహ—(నిండుదుఃఖముతో) తండ్రీ! జయవర్మా!

ఇరువురును నొక్కమారుగా కౌగిలించుకొనిరి. వారెంతకాల మట్లుండిరో వారికే దెలియలేదు. తండ్రీకొమరుల చిరకాల సందర్శనానందమును వర్ణింప తరముగాదు. వారిద్ద

రును కన్నుల నీరు పెట్టికొనిరి. మరల సోదరు లిరువురును మహానందముతో నొండొరుల కౌఁగిలించుకొనిరి. అదియే వారికి బ్రహ్మానందము—స్వర్గతుల్యము—పరమానందము. ఇంతలో లోనుండి ప్రభావతీ వసంతసేన లచ్చటికివచ్చిరి. మోహానుడు తన రెండవకుమారుడని తెలియగనే ప్రభావతి "పిన్నిదిగన్న పేద" చందమున నాతని గాఢాలింగనముజేసి "కుమారా! మోహానా! ఇన్నినాళ్ళకు నీకు మాపై దయగలిగెనా?" యని పలుకుచు బోరుమ నేడువసాగెను. కొంతసేపటికి మోహాను డామె నూరడించెను.

వసంతసేన యేమిచేయుచున్నది? ఆమె సోఫాపైఁ గూరుచుండి మోహానునివైపు దీనముఖయై చూచుచుండెను. నయనములనుండి యశ్రుబిందువులు ధరణిపై బొటబొట రాలుచుండెను. అందువలన నామెఫాలభాగమంతయు దడిసిపోయెను. మోహాను డామె దుఃఖించుటగాంచి చెంతకేగి రుమాలుతో నామె యశ్రుబిందువ్రులను దుడుచుచు "అమ్మా! వసంతసేనా! విలపించుచుంటివా? వలదు. వలదు. విలపింపవలదు. ఇక మన కష్టములన్నియు గట్టెక్కినని తలంపుము" అని కండ్లనెంబడి సంతోష బాష్పములను క్రిందకు వదలుచు నామె నోదార్చెను. వారందరు కొంతసేపటి కూరకుండి తమతమ కష్టసుఖముల జెప్పుకొనుచుండిరి.

---

## పదునొకండవ ప్రకరణము.

ఈ దినమే సుదినము. మోహనుడు జయవర్మగారి కుమారుడైనాడు. తలిదండ్రులు లేనికొరత మోహనునికి వదలిపోయెను. మాతాపితలు దొరకిరి. ఇక నాతని కేమికొరత? ఉన్నది. అది తన ప్రాణసమానమగు యమూల్యవస్తువు రమాసుందరి?

వారు కష్టసుఖములు చెప్పుకొనడమైనది. మోహనుడు తనయన్నయగు జగదీశునిజూచి "అన్నా! ఇప్పుడైన నీ ఛాయాపటమెవ్వరిదో తెలియజెప్పుము? చెప్పినయెడల మన కష్టములన్నియు గట్టెక్కును. ఇక నీ వాలోచింపబని లేదు. త్వరగ జెప్పుము?" అని వినయముగా బలికెను. అప్పుడాగది యందు ప్రభావతీ వసంతసేనలు లేరు. జగదీశుడు తమ్మునితో "తమ్ముడా! చెప్పెదకాని యీసంగతి రాజునకు దెలిసినయెడల మనకేమి కీడుమూడునో యని శంకించుచుంటిని" అనెను.

మోహ—అన్నా! నేనున్నంతకాలము నీవు రాజునకెంతమాత్రమును భయపడనక్కఱలేదు.

జగ—ఇక దాచనేల? ఇది రమాసుందరి ఛాయాపటమే. అవునుగాని ఇది నీ కెట్లు లభించినది?

మోహ—అగ్రజా! ఇది నేను రాత్రి మనయింటనే దొంగిలించితిని. అట్లు దొంగిలించుటకు కొన్ని కారణములు గలవు. అవి తరువాత జెప్పెదను లెమ్ము.

జగదీశుడు మోహానుని ధైర్యసాహసలీలల కచ్చెరు వొందెను.

జయ—నాయనా! నీవేనా పటమును దొంగిలించితివి?

మోహ—తండ్రీ! నేనే. అగ్రజా! ముందుకథ కానిమ్ము.

జగ—తమ్ముడా! రమాసుందరి రెండేండ్ల బాలికగా నున్నప్పుడు నే నామె రూపురేఖావిలాసంబుల జూచి యోర్వలేక యొకనాటి రేయి యాపసిపాపను దొంగిలింప తలంపుతో కోటయందు ప్రవేశించితిని. బాలికయొద్ద గాపున్న దాదులకు మత్తుమందు వాసనచూపి యెవరును చూచుటలేదని యాబిడ్డనెత్తుకొని వచ్చుచుంటిని. అకస్మాత్తుగా నొకయువకుడు భూతమువలె నాకెదుట ప్రత్యక్షమైనాడు. వెంటనే నాకు నిలువున ప్రాణము లెగిరిపోయినట్లయ్యెను. తరువాత వానికిని నాకును కొంతవరకు సంభాషణ జరిగినది. ఆ సంభషణయం దొడంబడిక లైనవి.

మోహ—ఆయువకు డెవ్వరు?

జగ—శ్యామలరావు—మాయదొంగ- పిశాచి—రాక్షసుడు.

మోహ—అన్నా! వాడు శ్యామలరావు కాడు. అది వాని మారుపేరు. తరువాత?

జగ—తరువాత నా పసిపాపను నాయొద్ద నుంచుకొనిన ముప్పు వాటిల్లునని తలంచి, పైయూరనున్న రాములాలను నొక వర్తకున కిచ్చితిని. కొంతకాలమున కారాములాలు గూడ సుందరపురమునకువచ్చి కాపురము చేయుచుండెను. ఇట్లుండ శ్యామలరావు మాటమాటికి మా యింటికి వచ్చి "రమాసుందరిని నాకు వివాహము చేసెదవా? లేక నీసంగతంతయు వికృమసేనున కెఱుంగ జేయుమందువా?" యని నన్ను భయపెట్టుచుండెను. ఆ హంతకు డొచ్చినపుడెల్ల వానికికొంత ధనమిచ్చి పంపి వేయుచుంటిని. ముఖ్యముగా నేను రమాసుందరిని పెండ్లియాడుతలంపుతో నామెను తస్కరించితిని.

మోహ—పటముసంగతి జెప్పుము?

జగ—ఆ ఛాయాపటమును మిక్కిలి రహస్యముగా తీయించితిమి. రాత్రి దాని నెవరో దొంగిలించిరని మేము మితిలేని పరితాపమును నొందుచుండగా హంతకుడు వచ్చెసి మాతో "మన మందరమును గుమిగూడి మోహనరావును తుదముట్టింత" మని చెప్పెను. అందులకు మే మంగీకరించనందుల కాతడు మాపై కోపమునొంది, మా నల్వురకు మత్తుమందు వాసనచూపి, మంచములపై పరుండబెట్టి

బంధించిపోయెను—మోహనా! చివరకు రమాసుందరియా దక్కలేదు. ఇకమీాద నిందలపాలు గావలసియుండునేమో?

మోహ—అట్లయిన సంగతంతయు బోధపడినది. ఇప్పటికి రమాసుందరి విక్రమసేనునియొక్క ప్రథమపుత్రిక యని తెలుసుకొంటిని.

ఇంతలో వసంతసేన యచ్చటకు వచ్చి మోహనరావు చేయిపట్టుకొని "మోహనా! కొంచెము ఫలహారము చేయుము. తరువాత మాటలాడుకొనవచ్చును" అని మరల భర్తను, మామనుచూచి "మీారుకూడ రండు" అని వారి ముప్పురిని గూడ లోనికి దీసికొనిపోయెను. అందరును తృప్తిగా ఫలహారము గావించిరి. తరువాత మోహనుడు తాను జయవర్మగారి ద్వితీయపుత్రుడ నని విక్రమసేనునకు తెలియచేసెను. అందువలన రాజు మిగుల సంతసించెను—

---

## పండ్రెండవ ప్రకరణము.

---

రాత్రి రెండుజాములు దాటెను. మింట చుక్కలు మిల మిల మెరయుచుండెను. రేయెండ మిక్కిలి మనోరంజకముగా నుండెను. అట్టితరుణమున నొక వ్యక్తి విక్రమసేనుని యుద్యానవనములో నడచుచుండెను. అతనికి నిలువెల్ల నల్లని ముసుగు. చెరసాలవైపునకు చర చర నడచిపోవుచుండెను.

కొంతసేపటి కాతడు గోవిందలాలును బంధించియుంచిన గది యొద్దకు బోయెను. అచ్చట కాపలాకాయురాజభటులు లేరు. గోవిందలాలు లోపల పరుపుపై పరుండి నిద్రపోవు చుండెను. ఆవ్యక్తి తాళపుచెవితో తలుపుదెరచి లోనికి బోయి యా నిదురించుచున్న గోవిందలాలును తట్టి లేపెను. ఆత డదరిపడి లేచి, "ఎవరువీరా"రని యాగంతకుని ప్రశ్నించెను.

వ్యక్తి—లాలూ! అల్లరిచేయకు. నెమ్మదిగా నాతోరా?

గోవిం—ఓయీ! నీ వెవరవు ?

వ్యక్తి—తరువాత జెప్పెదను. ఇప్పుడు మాటలాడకుండ నాతో రమ్ము.

గోవిం—ముందు నీ వెవడవో చెప్పెదవా? లేదా ?

వ్యక్తి—నేను సుదర్శనబలగములోనివాడను. తెలిసినదా? ఇంకను లేదా? నిన్ను విడిపింప వచ్చితిని.

గోవిం—నిన్నెవరుపంపిరి? మోహనరావా ?

వ్యక్తి—కాదు. మోహనుడెట్లు పంపును? శ్యామలరావు.

గోవిం—ఓరీ! మాయదారీ! అట్లయిన నేను రాను పొమ్ము.

వ్యక్తి—ఏమి?

గోవిం—పిరికివానివలె చెరనుండి పలాయనమగుట శ్రేయస్కరముగాదు.

వ్యక్తి—మరెట్లు బయటబడెదవు ?

గోవిం—నిజము తెలిసినతరువాత.

వ్యక్తి—ఎప్పటికి ?

గోవిం—నిలకడమీద.

వ్యక్తి—అసంభవము. ఇదిగో! నా మాటవినుము. నీహితముగోరి చెప్పుచున్నాను. ఎందులకు కష్టములపాల య్యెదవు ? నాకూడరమ్ము.

గోవిం—నీవు నాహితముగోరి చెప్పుచున్నవాడవే యైన మీశ్యామలరావును పట్టి బంధించి, మోహనున కప్ప గించి కరిమ్మలు నన్ను విడిపించి తీసికొనిపొమ్ము. లేదేని మారుమాటాడక బయటకుబొమ్ము.

వ్యక్తి—నేను తిరిగిపోవుటకు రాలేదు. నిన్ను చెర నుండి విముక్తునిజేసి నా కూడ తీసికొనిపోవ వచ్చితిని. తెలి సినదా ?

గోవిం—ఓరీ! చెరసాలనుండి పలాయనముగుట; దారులుకాచి బాటసారుల శిరములు విచ్ఛిన్నము చేయుట; దానిపాపము పండి యేయింతియైనను మీకండ్లబడిన దానిని కట్టుకొన ప్రయత్నములుసల్పుట; హత్యలు గావించుట; నమ్మించి మోసపుచ్చుట యిదియంతయు మీవృత్తి. నన్ను ను మీతో గలపుచున్నారా ?

వ్యక్తి—అన్నిమాటలకేమి ? నాతో వచ్చెదవా ? రావా ?

గోవిం—(కండ్లెర్రజేసి) ఓరీ ! మాయావీ! బయటకు పోయెదవా ? లేక నిన్ను పట్టి మోహానున కప్పజెప్పమందువా ?

ఆవ్యక్తి తన ముసుగును దీసివై చెను. ఆహా ! ఆశ్చర్యము ! ఎవరువారు ? డిటెక్టివు మోహానరావు. గోవిందలాలు మోహానునిజూచి తత్తరపడసాగెను. అతడది కలయని భ్రమించెను. అతడట్లే మోహానుని చూచుచుండెను.

మోహా—లాలుగారూ ! ఏమట్లు వెర్రివానివలె చూచుచున్నారు ?

గోవి—(అనుమానముతో) మోహానరావూ ?

మోహా—మీ యూహకు భిన్నముండునా ?

గోవిం—ఇంతరాత్రమున మీరు వచ్చుటకు కారణమేమి ?

మోహా—మిమ్ము చెరనుండి విముక్తుని జేయుటకు.

గోవిం—నేను హంతకుడనుకానా ?

మోహా—హంతకునివే యైనయెడల చెరసాలయందే యుందువు.

గోవిం—సరే ! మీదయ.

మోహ—లాలుగారూ! మీ మనస్థైర్యమునకు మిగుల సంతసించితిని. ఇక మీరు మీయిచ్ఛాలీల విహరింపవచ్చును. మీరు హంతకులుకారు. కాని హంతకులకును మీకును కొలదిగ సంబంధముండనోపు.

గోవిం—మోహనా! ఇంకను నీయనుమానము తీరలేదా?"

మోహ—పోనీ! దానిమాటకేమిగాని, ఆ దినమున మీరు సురాటనగర మేవనిమీద వెళ్ళియుండిరి?

గోవిం—క్షమింపుడు. ఆ ప్రశ్న నన్నడుగవలదు.

మోహ—సరే! తగు ప్రయత్నములుచేసి దానిని నేనే తెలిసికొందును.

వారిద్దరును చెరసాలనుండి బయటకువచ్చిరి. గోవిందలాలు సంతసముతో నింటికిబోయెను. మోహనరావు హంతకు డెవరాయని ప్రశ్నించుకొనుచు తన శయ్యాగారములోనికి బోయెను.

---

## పదమూడవప్రకరణము.

రాత్రి మోహనుడు శయ్యపై పరుండెను. గాని యాతనికి నిద్దుర పట్టలేదు. తనలో తాను ప్రశ్నలు వైచుకొని జవాబులు చెప్పుకొనుచుండెను. మంచముపై యిటునటు దొర్లుచుండెను. ఎంతదొరలిన నేమిలాభము?

ఇంతలో నకస్మాత్తుగా తలుపుగుద్దినశబ్ద మాతనికి వినంబడెను. ఆతడు చటాలున లేచి "ఎవరువారు?" అని ప్రశ్నింపకయే తలుపుతెరచెను. ఎవరువారు?—వ్యక్తి—స్త్రీమూర్తి—మాలతి. ఆమెవదనము కళావిహీన మాయెను. చూపులయందు భయచిహ్నములు చూపట్టుచుండెను. పాప మా యువతి తడబడుచున్న యడుగులతో, కొట్టుకొనుచున్న గుండెలతో మోహనుడు తలుపు దెరచుట తోడనే యాతనికంఠమును గబాలున కౌగిలించుకొనెను. కొంతసేపటికామె మోహనునివైపు జూచుచు "మోహనా! హంతకులు—ఇరువురు—నాకు మిక్కిలి భయమగుచున్నది" అని మిక్కిలి హీనస్వరమున త్వరితముగ వాకుృచ్చెను.

మోహ—మాలతీ! నీవు జడియనక్కరలేదు, హంతకు లెందరు? వారి చేతులయందేమున్నవి?

మాల—మహాశయా! హంతకు లిద్దరే. వారి చేతులయందు తళతళ మెరయు కరవాలము లున్నవి.

మోహను డామెను తన పర్యంకముపై గూర్చుండ నియమించి "మాలతీ! నీవిచ్చటనే గూర్చుండుము. నేను తలుపులు తెరచియే యుంచెదను. వారు వచ్చునపుడు నీవు భయపడుదానివలెనటింపుము. నే నీ తలుపుచాటున దాగి కొని యుండెదను. హంతకులీ గుమ్మములోపల కాలిడినంతనే నా చేతనున్న రివాల్వరుచే వారిని యమసదనంబున కనిపె

దను. జాగ్రత్తసుమా? నేను చెప్పినట్లు చేయుము. లేని యెడల కార్యభంగ మగును. ” అని మోహానుడు రివాల్వరు ధరించి తలుపుచాటున కేగెను. ఇంతలో బయటనుండి యిరువురిసంభాషణ మోహానున కిట్లు వినబడెను. మోహాను డంతయు జాగరూకతతో వినుచుండెను.

మొద—ఎటువైపు వెళ్ళినదిరా?

రెండ—ఇదిగో! యీగదిలో దూరిందిరా! చూడు?

మొద—సరే! నీవిక్కడనేయుండి, యెవరైన వచ్చుచున్నయెడల నాతో జెప్పుము. నేను లోనకుబోయి, మాలతినికట్టి తీసికొనివచ్చెదను.

రెండ—నీవు లోపల జాగ్రత్తగా యుండాలిమరి.

మొద—నాకు తెలుసునురా.

ఇక మాటలు వినుపించలేదు. అడుగులచప్పుడు మాత్రము వినుపించెను. మోహాను డాహంతకుడు వచ్చుచున్నాడని గ్రహించి యొడలెల్ల కండ్లుగలవానివలె చూచుచుండెను. అతడు వృషభమునకై పొంచియుండిన వనరాజువగిది పొంచియుండెను. హంతకుడు లోన ప్రవేశించెను. మాలతి భయము నభినయించెను. ఇంతలో దిక్కులు పిక్కటిల్లునట్లు “ఢాం” అను శబ్దమాయెను. వెంటనే హంతకుడా దెబ్బతో భూశయ్యాగతుడాయెను. “ఢాం” అను శబ్దము వినబడుటతోడనే బయటవేచియున్న రెండవహంతకుడు

పలాయనమంత్రము పఠించెను. వాడట్లు పరుగెత్తుకొనిపోయి చెట్లచాటునుండి నెమ్మదిగా నక్కినక్కి పోవుచుండెను. ఆ తొందరలో యాతనిఖడ్గ మెచ్చటనోజారి పడిపోయెను. అందువలన నాతడు మరింత భయమొంది, యడుగులలో నడుగులిడుచు, ముందునకుజూచుకొనుచు, వెనుకకు నడచుచుండెను. ఇంతలో నకస్మాత్తుగా నెవరో వచ్చి, యాతని చేతులు రెండును వెనుకకు విరచిపట్టుకొని ముందునకు త్రోసికొనుచు బోవుచుండిరి. "గాయముపై కారము జల్లినట్లు" హంతకునిప్రాణము లెగిరిపోయెను. ఆ నూతనపురుషుడు మన భీముడు.

భీముడాహంతకుని, మోహనరావు శయనమందిరమునకు లాగికొనిపోయెను. మోహనుడు భీముని జూచి "భీమా! హంతకునెట్లు పట్టుకొంటివి?" అని ప్రశ్నించెను.

భీము—నేను మొదట రివాల్వరుధ్వని విని యేదియో మోసము వచ్చెననితలంచి, పరుగుపరుగున తోటనుండి వచ్చుచుంటిని. త్రోవలో వీడు ముందునకు చూచుకొనుచు వెనుకకు నడుచుచుండుటగని, చప్పుడుకాకుండబోయి, వీని రెక్కలు వెనుకకు విరచి పట్టుకొంటిని. ఎంతసేపో గింజుకొనినాడు. లాభము లేకపోయెను.

మోహ—భీమా! మంచిపని గావించితివి. ఇప్పుడు వీనిని తీసికొనిపోయి రాజభటుల మేల్కొలిపి యురిదీయ

నాజ్ఞాపింపుము. ఇదిగో! ఈతుచ్ఛునికళేబరమును కందక ములో పారవేయ నాజ్ఞాపింపుము. ముం దీవని గానిమ్ము.

భీముడు మోహానునియాజ్ఞ శిరసావహించి, తాను పట్టుకొనినహంతకుని త్రాళ్ళచే బంధించి, యాకళేబరమును త్రాటిచే లాగించుకొనిపోయి కందకమునందు పారవేయించెను. కర్మిష్మరనాతడుతిరిగివచ్చి సజీవుండై యున్నహంతకుని దీసికొనిపోయి యరిదీయింప భటుల కాజ్ఞనొసంగి యెప్పటి యట్లు మోహానునియొద్దకు వచ్చి సంభాషింప మొదలిడెను.

మోహా—భీమా! నీ విప్పు డొకఘనకార్యము చేయ వలసియున్నది.

భీము—నేను సంసిద్ధుడనై యుంటిని.

మోహా—ఇప్పుడు నీ వీ హంతకులలో నొకనిగా నుండునట్లు వేషమును తీర్చికట్టి సుదర్శనబలగములో చేరి యచ్చట సంగతులన్నియు మా కెప్పటికప్పుడు తెలియజేయు చుండుము. మిక్కిలి మెలకువగలిగి యుండవలయునుసుమీ!

భీము—ఇప్పుడేపోయెదను సెలవిండు ?

భీముడు మోహానుని యాజ్ఞానువర్తుడై యచ్చట నుండి వెడలిపోయెను. ముందుజరిగిన భయంకరకృత్యమును గాంచినమాలతి కింకను భయముపోలేదు. ఆమె శయ్యపై పరుండియుండెను. కాని నిద్దురపట్టలేదు. హంతకుల సాహసము, మోహానుని విచిత్రపన్నాగము యామె కింకను కన్నుల యెదుట కట్టబడినట్లు గానుపించుచుండెను.

మోహ—మాలతీ! ఇక భయపడవలసినపని లేదు. హంతకులిద్దరును మడసిరి. నీవింక చింతదక్కి నిదురింప వచ్చును.

మాల—మహాశయా! ఇంకను నా భయపిశాచము వదలినది కాదు. నేనుమాత్ర మిప్పుడు నా శయ్యాగారము నకు బోవను.

మోహ—ఇచ్చటనే పరుందువా?

మాల—ఇచ్చటనే పరుండెదను.

మోహ—ఇచ్చట నీకు నిద్రపట్టునా?

మాల—ఇప్పుడు నాకెచ్చటను నిద్రపట్టదు.

మోహ—సరే! ఇచ్చటనేయుందుము.

వారిరువురును శేషించినరాత్రి యంతయు ముచ్చట లతో గడపిరి.

---

## పదునాల్గవ ప్రకరణము.

---

రమారమి సాయంత్రము నాలుగుగంటలకాల మాయెను. అట్టిసమయమున రామలాలు తన యర్ధాంగితో నేమేమో సంభాషించుకొనుచుండగా వీధితలుపుచప్పుడయ్యెను. రామ లాలు తలుపుతెరువ, నందు మోహనరావు ప్రవేశించెను. పురుషులిద్దరును సోఫాల నలంకరించిరి. సరళ రామలాలు ప్రక్కనే నిలువబడెను.

రామ—మోహనా! సమాచారమేమి?

మోహ—ఏమైన నున్నవేమో యని మీవద్దకొచ్చితిని.

రామ—నీకు దెలియనిసంగతులు మాకు తెలియునా?

మోహ—లాలూగారూ! నేను మీతో చాలవరకు సంభాషింప వచ్చితిని.

రామ—సరే! నేనును సిద్ధముగానే యున్నాను.

మోహ—లాలుగారూ! రమాసుందరి మీస్వపుత్రికయేనా?

ఈమాటలు వినినతోడనే సరళా రామలాలు లొకరిమొగమొకరు చూచుకొనుచుండిరి. ఆ చూపులయం దున్న భావమును మోహనరావు గ్రహించెను. వారిద్దరొకరిమో మొకరు చూచుకొని మరల తమదృష్టుల మోహనునివైపునకు ద్రిప్పిరి. వారేమిజవా బీయుదురో యని మోహనునిమనస్సు తత్తరపడసాగెను. కాని వారు జవాబీయకరెండునిమిషముల కాల మట్లే యుండిరి.

మోహ—ఏమట్లు తత్తరపడెదరు?

సర—నాయనా! నీ కానంశయ మేలకలిగెను?

మోహ—ఏమియును లేదు. నిజము చెప్పుడు.

రామ—మా స్వపుత్రికయే.

మోహా—మీరబద్ధమాడుచున్నారు. సత్యము పలుకుడు.

రామ—సత్యమునే పలుకుచున్నాను.

మోహా—మీరు సత్యము పలుకుటలేదు. అట్లయిన రమాసుందరి యెవరిపుత్రికయో నన్ను చెప్పుమనియెదరా? లేక మీరే చెప్పెదరా?

రామ—నీ వే చెప్పుము చూతము?

మోహా—రమాసుందరి ఏకవ్రియసేనుని ప్రథమపుత్రిక కాదా?

దంపతులవదనారవిందములు వెలవెలబోయెను. మాటలాడుటకైన శక్తిలేకపోయెను. వారు భయముచే గజగజ వడకుచుండిరి.

మోహా—లాలుగారూ! నాయూహ సరియైనదేనా?

ఇక రామలాలు బొంకి మోహానుని నమ్మింప నసాధ్యమని తలంచెను.

రామ—మోహానా! నీయూహ సరియైనదే. కాని యీసంగతి నీ కెట్లు తెలిసినది? ఇది మిక్కిలి గూఢముగా నుంచబడినదే!

మోహా—రహస్య మెన్నినాళ్ళకైన బయటబడక యుండునా? సర్వమును తెలసినది.

రామ—మోహానా! నీవు జయవర్మగారి ద్వితీయ పుత్రుడవుగావా?

మోహ—నీవు విక్రమసేనుని సోదరుండవే యైనచో నేను నిక్కముగ జయవర్మగారి ద్వితీయపుత్రుడ ననుటకు సంశయమేమి ?

"ఓహో! ఈతడు దేశాంతరునివలె గాన్పించుచున్నా డే! ఈసంగతి వీనికెట్లు తెలిసినది? సరే కనుగొనెదను" అని మరల మోహానునితో "అదే మట్లంటివి ? నీ మాటలు నాకే మియు నర్థము కాలేదు" అనెను. అంత మోహానుడు "అర్థము కాలేదా" అని తన జేబునందున్న ఛాయాపటమును దీసి రామలాలున కిచ్చెను. మరియొక పటమును దీసి సరళకొసంగెను. వారిపటముల వారుచూచుకొనిరి. వెంటనే వారి వదనపద్మములు వికసించెను. వారిలో వారే నవ్వుకొనుచుండిరి. అవి యేపటములు? జయసేన, చంద్రవదన ఛాయాపటములు. మోహాను డదంతయుగమనించుచు నూరకుండెను. రామలాలు చిరునగవు మోమున మొలకలెత్త "మోహానా! ఇందు నీ యుద్దేశమేమి?" యని ప్రశ్నించెను.

మోహ—ఈ రెండు ఛాయాపటములు మీవేనా?

రామ—మావే.

మోహ—అమ్మయ్యా ! ఇప్పటికి నగముకష్టములు గట్టెక్కినవి.

అని మోహానుడు దీర్ఘనిట్టూర్పు పుచ్చెను. పాఠక మహాశయా ! ఇక మనము సరళారామలాలులను, జయసేన

చంద్రివదన లని బిలుతము. మోహనుడు జయసేనునిగాంచి "జయసేనా! విక్రమసేనునకు కబురంపుదునా?" అనెను.

రామ — ఎందులకు ?

మోహ — ఎందులకేమిటి ?

మోహను డొక కాగితమును దీసికొని దానిపై విక్రమసేనుని పేర నొక యుత్తరమును వ్రాసెను. దాని నొక సేవకుని చేతికిచ్చి విక్రమసేనునకిచ్చి రమ్మనెను. సేవకుడు వెడలిపోయెను. మరికొంతసేపటి కాగద్వారమున విక్రమసేన సువర్ణమాలలు ప్రవేశించిరి. వచ్చియు రాకమునుపే విక్రమసేనజయసేనులు కౌఁగిలించుకొనిరి. చంద్రివదన సువర్ణమాలలు గూడ నొండొరుల కౌఁగిలించుకొనిరి. తరువాత కొంతసేపు వారికి యిష్టాలాపములు జరిగెను. రాజు మోహనుని గాంచి, మోహనా! పూజ్యుడగు జయవర్మగారి గర్భమున నీవు పుట్టబట్టికదా! మమ్మొందర నొకచోట జేర్చితివి?'' అనెను. మోహనుడు మోమున చిరునగవు మొలకలెత్త "రాజా! పరాత్పరుని దయారసామృతము మనపై వర్షించినది. మన మెంతయు ధన్యుల — మరచితి రాజా! రమాసుందరి మీ ప్రథమపుత్రికయని మీకు దెలియజేయుచున్నాను" అనెను.

రాజొక్కమారుగా నాశ్చర్యచకితు డాయెను. అతని కండ్లనుండి యానందబాష్పములు ధరణిపై జల జల రాలుచుండెను. దృష్టులు మోహనునియందు లగ్నమాయెను.

ఆ చూడ్కులతో నాతడు మోహనుని చెంతకు వచ్చి యాత ని రెండుకరంబుల బట్టుకొని—"మోహనా! నీమాట య థార్థమేనా?" అని యడిగెను. "ఇంకను సంశయమా? రమాసుందరి మీ ప్రథమపుత్రికయే" అని మోహనుడు జవాబొసంగెను. రాజు సంతోషజలధిని జలకమాడుచుం డెను. అట్టితరి రమాసుందరే యాతని కన్నులయెదుట నుండి "నాయనా!" యని పిలచిన యాతని యానందమును వర్ణింప నేరికి తరమగును?

రాజు—సోదరా! జయసేనా? ఇక మీరు కోట యందే నివసింపవచ్చును. పయనముకండు. ఇప్పుడే పోవ లయును.

జయ—అగ్రజా! అవశ్య మట్లే యొనర్చెద.

మో—అట్లయిన నాకును సమ్మతమే. మీరంద రిప్పుడే పోవచ్చును. నే నిచ్చటనే యుండి, యీగృహము నందున్న పరికరములన్నియు పంపెదను.

విక్రమసేనుఁడు, జయసేనుడు, సువర్ణమాల, చంద్ర వదన నలుగురును పల్లకీలయందు గూర్చుండి కోటలోనికి బోయిరి. మోహను డచ్చటనేయుండి, పరికరము లన్నియు పనివాఁడ్రిచే మూటలుకట్టించుచుండెను. అట్లు కొన్నిగంటలు లాయెను.

ఆసమయమున "మోసము! మోసము!" అని యను చు మాలతి మోహానునియొద్దకు వచ్చెను. మోహాను డామె ముఖకమలమును బరికించెను. వికసించి యుండలేదు.

మోహా—మాలతీ! ఏమిమోసము?

మాల—ఇకనేమున్నది? హంతకులు రాజును బంధించి తీసికొని పోవుచున్నారు.

మోహా—వారు కాలినడకనే పోవుచుండిరా?

మాల—లేదు. కారుపై పోవుచున్నారు.

మోహా—అట్లయిన మనకిప్పుడు కర్తవ్యమేమి? —

మాల—మనముకూడ వేరొక కారుపై వారిని వెంబడించుటయే ముఖ్యకర్తవ్యము. లేనియెడల ముప్పు వాటిల్లును.

మోహా—సరే! వారెటుబోయినదియు నీకు తెలియునా?

మాల—తెలియుకేమి? తెలియును. రండు. త్వరితముగ రండు.

వారిద్దరు నొక మోటారునం దాసీనులయిరి. మాలతి కారునడుపుచుండెను. మోహానుడు కారునందు నిశ్శబ్దముగ గూరుచుండి యిటునటు చూచుచుండెను. అతనికి మనుష్యులు, ఇండ్లు, వృక్షములు, పరుగెత్తుచున్నట్లు గానుపించుచుండెను. ఆ చలనహేతుకశకటము శరవేగమున బోవుచుం

డెను. వారు పురముదాటి యరణ్యమార్గముబట్టిరి. మిట్టపల్లములనక యాకారు మిక్కిలి వడివడిగా బోవుచుండెను.

మోహ—మాలతీ! హంతకు లీదారినే పోయిరా ?

మాల—ఈదారినే పోయిరి.

మరికొంతదూరమేగినతరువాత నాకా రాగిపోయెను. మాలతీ మోహనులు క్రిందకుదిగిరి. "హంతకు లెటువైపు బోయిరి?" అని మోహనుడు మాలతిని ప్రశ్నించెను. కాని మాలతి జవాబీయలేదు. ఏలకో కాని యామె తనయంబరమును మోహనుడు చూచుచుండగనే విప్పివైచుకొనెను. మాలతికాదు—హంతకుడు.

మోహనుడు జడియలేదు. కాని యాశ్చర్యమునొందెను. వెంటనే యాతడు హంతకుని వక్షస్థలముపై బలమైన కరాఘాత మిచ్చి చటాలున కారుపై గూర్చుండెను. హంతకుడా దెబ్బతో "శంభోశంకర్" అని నేలంగూలిపోయెను. ఇంతలో పదిమంది దొంగ లకస్మాత్తుగా వచ్చి పోవుట కుపక్రమించుచున్న మోహనునిపై బడి బంధించిరి. పాపము మోహను డెంత యత్నించినదైనను వారిచేతులలో నుండి బయటపడజాలకుండెను. వా రాతని గొంపోయి భూగృహమున బడవైచిరి.

ఆహా! మాయమాలతి యెంతపని జేసినది.

---

## పదునైదవ ప్రకరణము.

రమారమి రాత్రి రెండుగంటలైనది. జగమెల్ల గాఢాంధకారమయమై యుండెను. అంతయు నిశ్శబ్దము. కాని పక్షులలోకొన్ని రమారమి చటాలున లేచి కిలకిలారావములు చేయుచుండుటచే యానిశ్చలతకు భంగము వాటిల్లుచుండెను. ఆతమోమయంబున సుందరప్రాంతమందున్న భీకరారణ్యమధ్యంబున నొకయువతి. కాదు యువ్వాదిని. నడచుచూ బోవుచుండెను. ఆమె తెల్లనివస్త్రము ధరించియుండెను. అలకిరి యబోసియుండెను. ఆకులు కదలి చప్పుడగునని కాబోలును ఆమె నెమ్మదిగా నడుగులిడుచు బోవుచుండెను.

ఆమె యెచ్చటికి కళ్లు బోవుచున్నదో కదా ? అదిగో ఆ కనబడుచున్న పెద్ద పాషాణముదగ్గరకు బోవుచున్నది. దగ్గరకుబోయినది. ఆమె యా రాతిపై గూర్చుండలేదు. ఏంత గానున్నదే! ఆమె యారాతిచుట్టును తిరుగుచున్నది అట్లయిన యామె నిజముగా నున్మాదినియేనా? మొదటిప్రదక్షిణమైనది—రెండవ ప్రదక్షిణమైనది—మూడవప్రదక్షిణము పూర్తిగానైనది. అంతనామె యచ్చట నిలువబడి రాతివైపునకు చూచుచుండెను. ఆహా! ఆశ్చర్యము—ఇంద్రజాలము—కలియుగనటనావ్యతిరేకము—ఆ పాషాణము కదలుచున్నది. వెంటనే యామె చటాలునయెగిరి యా పాషాణముపై నాసీ

నురాలన్యోను. అంత నా పాషాణము నెమ్మదిగా భూమిలోని కి దిగిపోవుచుండెను. దానితోపాటు యున్మాదినికూడ లోనికి పోవుచుండెను. అట్లా పాషాణము చాలలోతువరకు బోయి యొక్క-చోటునం దాగిపోయెను. అది యొక యరణ్యప్రదేశ మువలె నుండెను. ఉన్మాదిని పాషాణమునుండి క్రిందికి దిగి రాతిచుట్టును మరల మూడుప్రదక్షిణములు చేయ నది పైకిపోయెను.

అంతనామె నలుకెలంకుల గలయజూచెను. ఎవరును లేని కతంబున యామె తన్నెవరైన నానవాలుపట్టకుండు నట్లు మోమును మేలిముసుగుచే కప్పివైచుకొనెను. అంత నా యున్మాదిని మిక్కిలి త్వరితముగా చెట్లనందునుండి పోవు చుండెను. కొంతదూరము పోయినతరువాత నామెకు దారి కానుపించలేదు. చెట్లన్నియు దట్టముగ నలముకొనియుండెను. వెంటనే యామె మిక్కిలి తత్తరపాటుతో చెట్లపై జేయిపెట్టి వెదక నారంభించెను. భయముచే వెనుకకు చూచుచుండెను. దైవయోగమున యామె కొక యినుపగొలుసు చేతికి దొర కినది. దాని నామె పట్టి గట్టిగలాగెను. వెంటనే యామె నిలు చున్నపాటున భూమిలోనికి దిగిపోయెను. అది యొక సొరం గము దానియందంతకంటెను గాఢాంధకారముగ నుండెను. ఆమె నిర్భీతియై యాసొరంగముగుండా నడచిపోయెను. ఒక్క-చోట నాసొరంగముదారి యంతమాయెను. ఎదుట నొక

యినుపతలుపున్నది. తలుపు తెరచి యామె యచ్చటనున్న సోపానముల నధిరోహించి బయటకు వచ్చెను. మరల నాసొరంగపుదారి నెవ్వరైన కనుగొనెదరని గాబోలు యామె యచ్చటనున్న దట్టమగునాకులుగల చెట్లకొమ్మలను దెచ్చి యాబిలోపరిభాగమును కప్పి మరుగుపరచెను. ఇటునటు జూచి యామె యొక్క యుద్యానవనమునైపునకు బరువెత్తుకొనిపోయెను. వనములో బ్రవేశించెను. తోడనే యామెకొక భీషణాకారుడు లోచనగోచరమాయెను. అతడు కూర్చొని కునికిపాట్లు పడుచుండెను. చేతరివాల్వరుగూడ నున్నది. అది గాంచుటతోడనే యా యున్మాదిని చటాలున నిలువబడిపోయెను. వానిమోము బాగుగా పరీక్షింప నారంభించెను. ఏలకోకాని యామె లోలోన నవ్వుకొనెను. భయరహితయై యామె యా భీషణాకారునిచెంతకు బోయెను. అంత నా యున్మాదిని వాని యజాగ్రత్తను దెలిసికొని చేనున్న రివాల్వరును నెమ్మదిగా సంగ్రహించి తన మొలయందు గుప్తపరచుకొనెను. తరువాత నామె యాతనివీపుపై తట్టుచు "భీమా!" యని పిలచెను. వెంటనే యాతడుత్రుళ్ళిపడి లేచి రివాల్వరును వెదకికొనుచు "అమ్మా! నీ వెవరవు?" అని ప్రశ్నించెను.

ఉన్మా—భీమా! నన్నే యెఱుంగవా?

భీము—అమ్మా! ఎఱుఁగుదును! కాని, యింతరాత్రమున యబలవగు నీ విచ్చటికి రాగతంబేమి? అయినను నీ వెట్లురాగలిగితివి?

ఉన్మా—అదంతయు నీకెందులకు? హంతకులు మోహానుని పట్టి బంధించినసంగతి నీకు దెలిసినదా?

భీము—అమ్మా! నాకే తెలియకుండునా? మోహానుని వారెట్లు బంధించిరి?

ఉన్మా—మాయామాలతి విచిత్రపన్నాగమువలన.

భీము—తెలిసినది. కాని నారివాల్వరేదమ్మా? దానినెవరు దాచిరి?

ఉన్మా—నేనే దాచితిని.

ఆ యున్మాదిని ముందుతీసినరివాల్వరు నాతనిచేతికిచ్చి "భీమా ఇప్పుడు మనకు కర్తవ్యమేమి?" అని యడిగెను.

భీము—రేపుదయమున నే మోహానుని కాళికకు బలియొసంగుదురట. అప్పుడు మన మిద్దరమును బోయి, విగ్రహామువెనుక దాగియుండి మోహానుని బలియొసంగుసమయంబున హంతకులను మన రివాల్వరుచే చంపి, మోహానుని రక్షింతము.

ఉన్మా—సరే! నీ యూహ యుక్తియుక్తముగానే యున్నది. నీ విప్పుడుపోయి మోహానునికి ధైర్యము గరపి రమ్ము. నీవు వచ్చునంతవరకు నే నిచ్చటనే యుందును. త్వరగపొమ్ము.

ఆమె యచ్చటనే గూర్చుండెను. ఉన్మాదిని యాజ్ఞాను వర్తియై భీముడు బంధితుడైయున్న మోహనుని చెంతకు బోయెను. అతడున్నగది కిటికీతలుపు తెరచిచూచెను. పాపము! మోహనుడు వనరాజువగిది గొలుసులచే బంధింపబడియుండెను. అత డాబంధనములనుండి విముక్తుడగుట కెన్నియోసారులు ప్రయత్నించి విఫలమనోరథుడాయెను. కిటికీ తలుపు దెరచుచప్పుడు వినబడుటచే నాతడు వెనుదిరిగి చూచెను, భీము డాతనికి ప్రత్యక్షమాయెను.

భీము—మోహనా! చింతదక్కి యుండుము, నీకేమియును భయములేదు. నీప్రాణములకు నా ప్రాణము లడ్డువైచెదను.

మోహ—తెల్లవారుజాముననే నన్ను కాళికకు బలి యిత్తురట. అప్పటికి నీవు సంసిద్ధుడవై యుండుము.

భీము—మోహనా? నీవు నా కింతగా చెప్పవలయునా?

మోహ—సరే! ఇక నీవు పొమ్ము. ఎవరైనను జూచిన మోసము వచ్చును.

భీము డచ్చటనుండి వెడలిపోయెను. మోహను డెప్పటియట్ల బంధితుడై పడియుండెను. ఇంతలో నా గదితలుపు గభాలున తెరువబడెను. వెంటనే మోహనున కొక దీర్ఘకాయుడు ప్రత్యక్షమాయెను. మోహను డాతని బొమముడిపా

టుతో చూచి యూరకుండెను. ఆ దీర్ఘకాయుండెవఁడు? మన కపరిచితుఁడు—ప్రచ్ఛన్నవేషధారి—దొంగలనాయకుఁడు—ఘోరరాకాసి—శ్యామలరాజు.

శ్యామ—మోహనా! ఇప్పుడు నీస్థితి యెట్లున్నది?

మోహ—(సగర్వముగ) పరమానంద కరముగా నున్నది.

శ్యామ—పరమానందకరముగ నున్నదా? తెల్లవారినపిదప కాళికాలయమున నీ వేయానందముగా నుందువో?

మోహ—బ్రహ్మానందముగా నుందును.

శ్యామ—నీమాటలు వినిన నాకునవ్వువచ్చుచున్నది.

మోహ—ఆ నవ్వవుకన్నీళులుగా మాఱును. తెలిసినదా?

శ్యామ—ఏమీ! నీ బింకపుమాటలు! ఇప్పుడు నీవు నాయధీనమందున్నావు. తలంచుకొనినచో, నేను నిన్నిప్పుడేమిన్నైన చేయుగలను.

మోహ—అట్లయిన నీవు స్త్రీజాతికంటె నధమాధముఁడవు.

శ్యామ—ఓహో! ఇప్పుడు నీకు చాలు తెలివి వచ్చినట్లున్నదే!

మోహ—నీకు వినాశకాల మాసన్నము కాబట్టియే విపరీతపుబుద్ధులు పుట్టుచున్నవి.

శ్యామ—ఇక నీతో ప్రసంగించు టనవసరము.

మోహ—ఓరీ! ప్రచ్ఛన్న వేషధారీ! బంధితుఁడనై యుంటిని. నిన్నింతసేపు నాతో సంభాషింప నవకాశము కలగనిద్దునా? ఒక్క ముష్టిఘాతముచే నీ శిరము విచ్ఛిన్నము చేయకపోదునా?

శ్యామ—నీడంబము లిక కట్టిపెట్టుము.

అని యాతఁడు బయటకుబోయి తలుపు బంధించెను. మోహనుఁడు యథావిధి శయ్యపై నిర్విచారముగా పండుకొనెను. శేషించినరాత్రి యాతనికి నిద్దురయే పట్టలేదు.

---

## పదునారవ ప్రకరణము.

—:o:—

ప్రభాతమాయెను. హంతకు లిప్పుడే మోహనుని కాళికాదేవికి బలియిచ్చెదరు. ఆ సమయమున ముగ్గురు హంతకులు మోహనుఁడున్న గదివైపునకు బోవుచుండిరి. వారిలో నొకని చేతియందు పళ్ళెరమున్నది. దానియందు పూజాద్రవ్యములును, మరియొక పూలదండగూడ నుండెను. తక్కిన యిరువురి చేతులయందు తళతళమని మెఱయు కరవాలము లుండెను, వారు మోహనునిగది సమీపించి, తలుపు దెరచి లోనకుబోయిరి. మోహనుఁడు వారిని గాంచినతోడనే యాతని కదొకవిధమగు భీతి జనించెను. కోప మగ్గలమాయెను. ఒక్క యుదుటున లంఘించి, యాముప్పురను గూడ హత

మాగ్పనెంచెను. కాని యట్లుచేయుట కాతని కవకాశము లేకపోయెను. కాళ్ళు చేతులు గూడ బంధింపబడియుండెను. తన జేబునందున్న రివాల్వరును తీయుటకొర కెంతసేపొ యత్నించెను. కాని సఫలీకృత మనోరథుడు కాజాలకపోయెను! కండ్లెఱ్ఱజేసి వారివైపు చూచెను. వా రేమాత్రమును జడిసి నట్లు గానుపింపలేదు. మరల హుంకరింప మొదలిడెను.

మొద—రంగా! చూడ్రా! ఏలాగు హుంకరిస్తు న్నాడో!

రంగ—హుంకరిస్తాడు, హుంకరిస్తాడు. అమ్మోరు గుడిలోని కెళితె మా బాగా హుంకరిస్తాడు.

రెండ—ఇంక పసుపురాయండ్రా! తరువాత మాట్లా డదాం.

వారు మోహానుని బంధములు విప్పి, యాతని యొడ లంతయు పసుపురాసిరి. మెడలో పూలదండ వేసిరి ఇద్దరు వాని రెండు రెక్కలను బంధించి బయటకు తీసికొనివచ్చిరి. మోహాను డేమియు మాటలాడలేదు భీముని ధైర్యోపదే శము లాతనివిచారమును బారదోలెను. వారు కాళికాలయ మునకు నడక సాగించిరి. హంతకులు ముగ్గురు దారిలో నీ క్రిందివిధముగ సంభాషింప మొదలిడిరి.

మొద—రంగా! వీడేనా భూగృహములో పలకువచ్చి మనల నందరిని చావగొట్టినాడు?

రంగ—ఔను. వీడే.

రెండ—పదిమంది నొకేసారి యింటిలోపెట్టి బయట తలుపు బంధించాము. చూడ్డామరి ? అం తాలోచ నుందీ !

మొద—ఈతిప్పలన్నీ వీడికెందుకూ ?

రంగ—మనల్ని పట్టుకొని ఖైదులో పెడదామని—

మొద—అబ్బోరబ్బో! ఖైదులో పెట్టడానికే ?

రెండ—మరి యింకేమనుకున్నావురా ?

మొద—వీడిళొాడు. వీడా మనల్ని ఖైదులో పెట్టేపాటి మొనగాడు ! చిత్రంగా వున్నాదే ? చూస్తే కుర్రోడు. మనం దరిని యేలాగ పట్టుకుంటాడు ? చాలమందిమున్నాము ?

రం—ఉంటేమాత్రం వీడికిలెక్కా ?

మొద—ఆ! ఆలాగైతేమరి గబగబా నడండిరా. ఒక్కేటికే తలకాయ తరిగేద్దాం.

రెండ—మరి వెళ్ళుతున్నామా, లేదా?

మొద—అయితే యీాడిపే రేమిటిరా?

రం—మోహనరావు.

అంత వారు కాళికాలయమును సమీపించిరి. సంభాషణ చాలించిరి.

అదియొకపాడుదేవాలయము. కొన్నికొన్నికుడ్యములు విరిగి క్రిందపడియుండెను. అచ్చటచ్చట మరికొన్నిగోడలు కూలియుండెను. అట్లు విరిగినగోడలపై బ్రహ్మాచెముడు మొ

లచియుండెను. ఆలయముచుట్టును, పూలమొక్కలు చుట్టు కొనియుండెను. అవి యాదేవాలయమున కదొకవిధమగు వింతశోభ గలుగజేయుచుండెను. ఆలయము తలుపులు తెరచి యేయున్నవి. మోహనుడదంతయు వింతగా చూచుచుండెను. విస్మయమందుచుండెను. భీమ సింకను రాలేదని చింతించుచుండెను.

వారందరు లోనికిబోయిరి. తోడనే వారికిభీతిగొలుపు భీకరాకారముతో కాళికావిగ్రహము ప్రత్యక్షమాయెను. మోహనునకు మరింతభయమధికమాయెను. "భీమ సింకెప్పుడువచ్చి, నన్ను రక్షించునా"యని తనలోతా ననుకొనుచుండెను. హంతకులు ముప్పురును మిక్కిలిసంతసముగా నుండిరి. వారుతెచ్చిన పూజాద్రవ్యమంతయు కాళియెదుటబెట్టి యొకరితరువాతనొకరు దేవికి సాష్టాంగదండప్రణామము లాచరించి "అమ్మవారికి జై" "కాళికాదేవికి జై" యని కేకలు వేయసాగిరి.

మోహనునకేమియు దోచుటలేదు. అత డున్మాదునివలె నిలువబడియుండెను. "ఆహా! నాయాశలన్నియు నిరాశలాయెను. నాకు ధైర్యోపదేశముజేసినభీముడు రాకుండగనేమిచేయుచున్నాడోగదా! ఒక వేళ నాతడు గూడ పట్టుబడెనా? ఏమో! ఏమియుతెలియకున్నది. సరే! కానున్నది కాకమానదు. పిదప దైవకృపయెట్లున్నదో?" అని మోహ

నుడు తనలో తాను చింతించుకొనుచుండెను. హంతకులు మోహానునివైపుజూచి "ఏమయ్యో! అమ్మవారిని ప్రార్థించు కొని సిద్ధంగావుండు" అనిరి.

రం—నేను నరుకుతాను. కత్తి నాచేతి కియ్యండి.

మొద—నీ వెందుకూ ! నీ వూరుకో, మేము నరుకు తాము.

రం—మీకు చేతగాదురా. ఒక్కేటికే తలకాయ తెగాలి.

రెండ—మాకామాత్రము తెలుసును! నీవు చెప్ప నక్కర లేదు.

రం—అదికాదురా. ఆవేళ పెద్దగేటుదగ్గర వీడు నన్ను మెడలమీద గట్టిగా కొట్టేడురా. అదింకా బాధపెడుతూం దిరా. అందుచేత నాచేతికి కత్తియ్యండి, నాకసితీర నరుకు తాను.

మొద—వీడు కొట్టినదెబ్బ బాధపెడుతుంటే బాధ పడు. ఏడు. మాకేం.

రం—అరేయి! మీరు నాకు కత్తియ్యకపోతే నా దగ్గర రివాల్వరున్నాది. దానితో వీడిని "ఢాం" అనిపిస్తాను. మరి.

మొద—రంగా! నీవుకాని రివాల్వరుతోకొట్టావంటే శ్యామలరావుగారితో చెప్పి నీ తలకాయ తీయిస్తాం. తెలి సిందా ?

రం—(భయముతో) అరేయి! అంతకోప మెందుకు రా. ఆలాగన్నానుకాని, దీనితో పీడిని కొడుదుననే మీ యుద్దేశం. అయ్యగారితో చెప్పకండిరా.

రెండ—ఆలాగైతే, నీ రివాల్వరు పళ్ళెములోబెట్టి, పళ్ళెము పట్టికొని అక్కడ నుంచో.

రంగడు తన రివాల్వరు పళ్ళెమం దుంచి, దానిని చేతితో పట్టుకొని, యర్చకునివలె నిలువబడియుండి చూచుచుండెను. మోహానుడు కాళికాదేవిని ప్రార్థించుటకై మోకాళ్ళపై గూర్చొని యంజలిపట్టెను. ఇరువురు హంతకులు మోహానుని యిరుప్రక్కల ఖడ్గహస్తులై యమకింకరులవలె నిలువంబడియుండిరి.

"ఓతల్లీ! మహాంకాళీ! సాధుజనచింతామణీ! ఈ దీనునియందు నీ కణుమాత్రమేని కనికరము లేదా? నాయందు కొంచెముకృపామతి నూహింపుము. జగజ్జననీ! నన్ను గాపాడుట కిదియే సమయము నీవుకాక దిక్కెవ్వరు? నీ శరణు దూరుచుంటిని. నీటముంచినను పాలముంచినను నీదే భారము. అమ్మా! ఇదిగో! నాకడసారిప్రార్థన. రక్షింపుము. రక్షింపుము" అని ప్రార్థించి మోహానుడు శిరము వంచెను.

రం—ఇంకా సూస్తారేమిరా? వెయ్యండి.

దురాత్ములిద్దరు కత్తులనెత్తిరి?

* * * * * *

మోహనుని శిర మెగిరిపోవును.

* * * * * *

ఆహా ! కాళికాదేవి దయారసము !

ఇంతలో నకస్మాత్తుగా దిక్కులుపిక్కటిల్లునట్లు "ఢాం" "ఢాం"అని రెండుసారులు రివాల్వరు పేల్చినశబ్ద మాయెను. ఆదెబ్బలతో నిద్దరు హంతకులు భూశయ్యాగతులైరి. పాపము ! మూఢపవాడగు రంగనికి ప్రాణములెగిరిపోయెను. ఆతడు చేతనున్న పళ్లెము నట బారవైచి, ఆ యాలయము నుండి బయటకు లంఘించెను. అదేపరుగు—అదేలోకము. వెనుకకు చూచుట లేదు. ఇంతలో మోహనుడు చటాలున పళ్ళెమందున్న రివాల్వరు దీసికొని బయటకువచ్చి, భయము చే పరుగెత్తుచున్న రంగనికి గురిచూచి పేల్చెను. వెంటనే రంగడుకూడ భూదేవిని కౌగిలించుకొనెను. ఇంతలో భీము డు మోహనుని దుస్తులను బట్టుకొని మోహనునియొద్దకు వచ్చెను. ఆ తెచ్చిన దుస్తులను మోహనుడు ధరించెను.

మోహ—ప్రాణరక్షకా ! భీమా ! నీ ఋణం బీజన్మ మునకు దీర్చుకొనగలనా ?

భీము—మహాశయా ! నీప్రాణరక్షణకై నే నేమియు పాటుపడలేదు. అదిగో ! ఆతోటయందొక స్త్రీమూర్తి యున్నది. ఆమెయే నీ ప్రాణరక్షకురాలు.

మోహ—ఎవ్వరాస్త్రీమూర్తి ?

భీము—ఉన్మాదిని.

మోహ—(కంగారుతో) ఏదీ! ఆమె యెక్కడ? నన్ను తీసికొనిపొమ్ము?

వారిద్దరును గలసి యున్మాదినియొద్ద కేగిరి. వీరిద్దరను చూచి, కూర్చున్న యున్మాదిని లేచి నిలువబడెను.

మోహ—తల్లీ! నాప్రాణరక్షకురాలవు. నీ వెవ్వరవో యెఱుగవచ్చునా?

ఉన్మా—నన్ను "తల్లీ" యనిమాత్రము సబోధింపకుము.

మోహ—(ఆశ్చర్యముతో) ఇదేమి! ఈయశ్లీలవాక్యము లేమి?

ఉన్మా—ఇందశ్లీలవాక్యము లేమున్నవి?

మోహ—పోనీ! మీనామధేయమేమి?

ఉన్మా—నా నామధేయము మీ కవసరమా?

మోహ—అవసరము గనుకనే యడుగుచుంటిని.

ఉన్మా—నా నామధేయముతో మీ కేమిపని?

మోహ—విని సంతసించుటకు—

ఉన్మా—నా నామధేయము విని సంతసించుటకు బదులుగా నన్ను చేపట్టి సంతసింపరాదా?

మోహ—ముందు నామధేయముమాత్రము తెలుపుము. తరువాత నీయభీష్టము తీర్చెదను. నీవు నాకెన్నియో మారులు గూఢార్థమగు మాటలచే సహాయము చేసితివి.

ఉన్మా—నా యభీష్టము తీర్చెదనని చేతిలో చేయి వేయుము.

మోహను డామెచేతిలో చేయివైచెను. వెంటనే యాయున్మాదిని తన మోముపైనున్న మేలిముసుగును తీసివైచెను ఆ యున్మాదిని యెవ్వరు? మాలతి. మోహను డాశ్చర్యమునొందెను. అది కలయో కల్లయో గూడ తెలిసికొనజాలకుండెను. అప్పు డతని యానంద మింతింత యనివర్ణింప మాతరముగాదు మితి లేని సంతోషముతో నాతడామాలతి నొక్కమారుగా బిగియకౌఁగిలించుకొనెను. ఆమె చెక్కులు తనివిదీర ముద్దుగొనెను. ఆ యువతీయువకు లాకౌఁగిలిలో నెంతకాలముండిరో వారికే దెలియలేదు కొంతసేపటికి మోహనుడు కౌఁగిలి వదలి యామె చేతిని గ్రహించెను.

మాల—ప్రాణేశ్వరా! మిమ్ముల భర్తగా బడయుటకు నా జనకుని మనంబునకైనను నొప్పుకొంటిని.

మోహ—మాలతీ! నన్ను భర్తగా స్వీకరించుటకు నీ వింతశ్రమపడవలయునా? నేను నిన్ను ప్రేమించుట లేదని తలంచితివా?

మాల—నిజముగ ప్రేమించితిరా?

మోహ—త్రికరణశుద్ధిగ—

మాల—అట్లయిన నే నెంతయు ధన్యురాలను.

భీము—మోహనా! ఇక మనము జాగుసేయరాదు. రయమున బయటకు బోవలయును. ఇప్పటికే చాల తడ వయ్యెను.

మోహ—భీమా! ఔను. బయటకు బోవలయును.

భీము—ఇంకను "ఔను" ఏమిటి? నడువుడు.

మోహ—దారెట్లు?

భీము—నాకును దెలియదు.

మాల—నాకు దెలియును. నావెంట రండు.

వారుమువ్వురును ముందు మాలతివచ్చిన రహస్య బిలముగుండా బయటకు బోయిరి.

---

పదునేడవ ప్రకరణము.

అప్పుడే భానుడు పశ్చిమాంబుధిని గ్రుంకుచుండెను. పూర్తిగా నిర్మక్షమింబెను. సాయంసమయము. అట్టితరుణమున మోహనరావు భగవంతునిపై భారముమోపి భూగృహములో చొరబడవలయునని యరణ్యములో ప్రవేశించెను. పాషాణ మెచ్చటనున్నదో యని వెదుక నారంభించెను. కొంతసేపటి కాపాషాణ మాతనికి గానుపించెను. వెంటనే యాత డారాతిచుట్టును ముమ్మారు తిరిగి తరువాత నది కదలుచున్న సమయమున దానిపైనెక్కి గూరుచుండెను. అతడా

పాషాణముతో భూమిలోనికి దిగిపోయెను. తరువాత నాతడు మఱియొక రహస్యబిలముగుండా బోయి భూగృహము చేరుకొనెను. తన్నవరైన గుర్తింతురని నిలువెల్ల ముసుగు వైచుకొనెను. నెమ్మదిగా నతడు ముందునకు నడచుచుండ కొలది దూరములో నాతని కొక యుద్యానవనము గానుపించెను. అదియే ముందు మాలతికి గానుపించిన యుద్యానవనము.

అతడు త్వరితముగ నడచిపోయి యా యుద్యానవనము చేరుకొనెను. దానియం దెవ్వరును లేరు. ముందునకు రెండడుగులు వైచి చూచెను. అచ్చట నొక పాడుపడిన గృహ మాతనికి గానుపించెను. దానిప్రక్కనే యొకనూయి కూడ నుండెను. ఇంటితలుపులు తెరచియే యున్నవి అందువలన నాతడు దానియం దెవ్వరైననుందురని తలంచి యా గృహమునొద్దకు నెమ్మదిగాబోయి గవాక్షముగుండా లోనికి తొంగిచూచెను. దానిలో యిరువురుపురుషులు గుసగుసలాడుకొనుచుండిరి. ఆమాటలు మోహనునకు వినంబడుటలేదు. తరువాత వారు సంభాషణ చాలించిరి. ఇద్దరియువకులలో నొకడు బయటకు వచ్చుచున్నాడని మోహనుడు పదధ్వనివలన తెలిసికొని యచ్చట నిశ్చలతకు భంగము గలుగనీయకుండ ప్రక్కనున్న పొదచాటున పొంచియుండెను.

ఆగృహమునం దొకయువకుడు బయటకువచ్చి నల్దిక్కుల పరికించుచుండెను. ఏమియు గానుపించలేదు. కాని కటికిచీకటిమాత్ర మాతని కండ్లయెదుట తాండవమాడుచుండెను. ఆయువకుఁడు మెట్లను దిగి నూతివైపునకు బోవుచుండెను. ఇదే సమయమని యెంచి మోహనుఁడాతని వెంబడించెను ఏయుద్దేశముతో మోహనుఁడాతని వెంబడించెనో తెలియదు. రమాసుందరివద్ద కాతనినిగూడ తీసికొనిపోవునా?

ఆయువకుడు బావిని సమీపించెను. బావిలోపలకు బోవుటకు సోపానములున్నవి. అతఁడాసోపానములమీఁదినుండి క్రిందికి దిగిపోవుచుండెను. మోహనరావుగూడ వానిననుసరించి మిక్కిలి జాగరూకతతో బోవుచుండెను! వారిద్దరును సమాన వేగమున బోవుచుండిరి. వారిద్దరకును మధ్య దూరము ఇంచుమించుగా పదిమెట్లు. వారట్లు చాలదూరముపోయిరి. ఒక్కచోట మెట్లంతమయి యొకయినుపతలుపు గానుపించెను. యువకు డాతలుపు తెరచుకొని లోనికిఁబోయి మరల తలుపుబంధించెను. వెంటనే మోహనుఁడు తలుపు త్రోసి చూచెను గాని ప్రియత్నము ఫలింపలేదు. అతడేమియు నాలోచింపక తలుపుపై గట్టిగా గుద్దెను. వెంటనే తలుపుతెరువబడి మొదటియువకుడే యాతనికి గానుపించెను.

యువ—ఓయీ! నీపేరేమి? నీ వెవరవు?

మోహ — నే నపరాధపరిశోధకుడ నగు మోహన రావును.

మోహనుని నామాక్షరము లా యువకుని చెవి సోకి నంతనే యాతనికి నిలువున ప్రాణము లెగిరిపోయెను. గజగజ వడకసాగెను. మారుమాటాడకయే యాయువకుడు మోహనునిపై బడెను. మోహనుడు జడియక యాతనికంఠము పట్టుకొని మత్తుమందు వాసనచూపెను. అంతమాత్రముననే యూరకుండక తన జేబురుమాలుచే నాయువకుని చేతులు బంధించి గదిలోనికి దీసికొనిపోయి యచ్చట నొక సోఫా యుండ దానియం దాతనిని గభాలున పడవైచెను.

పడవైచినతోడనే మన నిగూఢకుడు పిలుచునప్పాటున భూమిలోనికి దిగిపోయెను. అతడొక గదియందు పడెను. మోహను డాశ్చర్యచకితుడై "ఏమీ! నేనిచ్చటి కెట్లు వచ్చితిని? (ఆలోచించి) మాంత్రికుని పడవైచినసోఫాయం దేదో చిత్రముండనోపు" అని భాషించుకొని యాతడు నల్దిక్కుల పరికించెను. అంతయు నంధకారబంధురమై యుండెను. ఆతడు వెంటనే భయభ్రాంతుడాయెను. విద్యుద్దీపికను వెలిగించి చూచెను. నాలుగువైపులనుగూడ గోడలే. ద్వారములు లేవు. గవాక్షములు లేవు. మోహనుని హృదయవేగము వాయువేగమును నిర్గమించెను. ఎంత ప్రయత్నించి వెదకి చూచినను దారి కానుపించుటలేదు. చదువరా! మన మోహను

డింకెట్లు బయటపడును? ఇంకెట్లు రమాసుందరిని విడిపించును? భూగృహములో మరల రెండవసారి మోహనుడు బంధితుడయ్యెను.

అతడున్నగది నేలభాగమంతయు నయోమయమై యుండెను. దానియం దెట్టిధమైనవస్తువులును లేవనియే చెప్పవచ్చును. అతడు గోడకు జేరబడి నిలుచుండెను. "ఆహా! ఎంతమందమతిని! ఈకారాగారమును నాయంతట నేనే కోరి తెచ్చుకొంటినే! ఏదిదారి? ఏమియుగాన్పించకున్నదే! ఇప్పుడు కర్తవ్యమేమి? ఏమియు దోపకున్నది. నేనిట్లు బంధితుడనై యుండవలసినదేనా? అట్లయిన రమాసుందరి గతియేమికావలయును? ఆమెను శ్యామలరావు బలవంతముగ పరిణయమాడును. ఓని యూరకుండగలనా?" యని విశ్వధగ తుల చింతించి పిచ్చివానివలె నాగది యంతటను తిరుగులాడుచుండెను. చేతనున్న విద్యుద్దీపము వెలుంగుచునే యున్నది.

ఇంతలో నాతనికాలికేదో గట్టిగ తగిలెను. అదియొక మేకు. మోహనుడు విస్మయచిత్తుడై యా మేకునందు తప్పక రహస్యముండితీరునని తలంచి దానిని కాలితో గట్టిగ త్రొక్కి వైచెను మేకు లోపలకు బోయెను. విచిత్రముగా నాగది నేలభాగమంతయు క్రిందకి నెమ్మదిగా దిగిపోవుచుండెను. మోహనున కాశ్చర్యము పొండాయెను. మరికొంతసేపటికా నేలభాగము నాలుగినుపగొలుసు లాధారముగా క్రిందకు

దిగుచుండెను. నాలుగుగోడలును ఆచ్చటి కంతమాయెను. ఆటుల నది చాలభాగము క్రిందికిదిగి, యొక్కచోట సాగి పోయెను. అచ్చటనుండి భూమి యెంతలోతున నున్నదో యని విద్యుద్దీపకాంతిసహాయమున జూచెను. ఎంతయో లోతు లేదు. కాని యారడుగులుమాత్రమున్నది. ఆత డచ్చటనుండి క్రిందికురికెను. మరలనాతడు పైకిచూడ నా నేలభాగ మంతయు పైకిబోవుచుండెను. మోహనున కిందంతయు మాయవలెనుండెను. హాంతకులను లోలోన మెచ్చుకొనుచుండెను. తా నున్నదే పాతాళగృహము. అత డచ్చటనే నిలువబడి యిటునిటు పరికించెను. జనసంచార మేమియును లేదు.

అంతయును నిశ్శబ్దమయమై యుండెను. మోహను డొక చేత రివాల్వరును, మరియొక చేత విద్యుద్దీపమును ధరించి యా పాతాళగృహమున నిర్భీతుడై పోవుచుండెను. కొలది దూరములో నాతని కొక సుందరమందిరము లోచనగోచర మాయెను. వెంటనే యాతడాచీకటిలో ఆ దీపకాంతిసహాయమున చిక్కలి వడిగా నచ్చటకు బోయెను. ఆ మందిరపు తలుపు లన్నియు మూయబడియుండెను. గవాక్షములు గూడ మూయబడియుండెను. మోహను డిటుపటు పరికించి నెమ్మదిగా తలుపుద్రోసి చూచెను. తలుపు తెరువబడెను. ఆ గది యందు దీపములేదు. చీకటి చీకటి కటికచీకటి.

అతఁడు దీపమును వెలిగించి లోనకు తొంగిచూచెను. అది నిర్మానుష్యమై యుండెను. అదియొక శయ్యాగారము. దానిలో నొకపర్యంకము మిక్కిలి రామణీయకమై యొప్పారుచుండెను. మోహను డాగదియందు ప్రవేశించి, యాశయ్యను జూచి మిగుల సంతసించి "దొంగలనాయకుఁడు విలాసపురుషుఁడే!" యని తలంచి యాతడాపర్యంకమున గూరుచుండెను. వెంటనే యా గదియం దంతట నొక్కమారుగ ననేక విద్యుద్దీపములు వెలింగెను. పరిశోధకుఁడు ప్రక్కనుండి చటాలున శయ్యపైనుండి లేచిపోయెను. వెంటనే దీపములన్నియు నొక్కమారుగా నారిపోయెను.

మోహనుఁడు ప్రక్కనున్న గదితలుపు దెరచి లోనికి పోయిచూచెను. అచ్చటను గూడ నెవ్వరులేరు. అత డట్లే చాల ద్వారములు దెరచిపోయెను అచ్చటనున్న మరియొక గదితలుపు దెరువబోవ నది యాతని కసాధ్యమాయెను. అంత నాతఁడు "అన్నితలుపులు తెరచియేయున్నవి. ఈ గది తలు పొక్కటియు మూయబడియుండుటకు కారణమేమి ?" అని యనుకొని యా గదిగవాక్షమునొద్దకు బోయి దానిని కూడ ద్రోసిచూచెను. దైవయోగమున నాకిటికి తలుపులు తెరచియే యుండెను. మోహను డాగవాక్షముగుండా లోనికి తొంగిచూచెను. దానిలో నొకదీపము రక్తకాంతుల ప్రసరించుచుండెను. ఆ కాంతిలో నొక స్త్రీమూర్తి విచారచిత్తయై

శయ్యపై గూర్చుండి యేమియో కాకితముపై వ్రాయుచుండెను. ఆమెముఖపద్మము వికసించి యుండలేదు. ముకుళించి యుండెను. ఆ స్త్రీమూర్తి యెవ్వరు ?

మోహనునికి చూచుచుండగనే కండ్లశ్రుజలపూరితములాయెను చిత్తము వ్యాకలనమందెను. కంఠము రుద్ధమాయెను. ఆతడామెను పిలువ ప్రయత్నించెను. కాని యతనికంఠ మాతని స్వాధీనమందు లేదు. కొంతసేపటివరకట్లే యాతడు వెరగంది నిలువంబడిపోయెను. రెప్ప వాల్పకుండ నాతడామెవైపునకే చూచుచుండెను. మరల నాతడామెను పిలువ ప్రయత్నించెను. అతికష్టముతో నాతడామెను “రమా !” యని పిలచెను. ఆ కంఠస్వరము సన్నగిలియుండుటచే యామె పిలుపు నామెకు వినంబడలేదు. ఆమె వ్రాతామె చూచుకొనుచుండెను. మధ్య మధ్య నామె వ్రాతమాని యేమియో యాలోచించుకొనుచుండెను. శిరముమాత్రము పైకెత్తలేదు. ఆమె యేమి వ్రాయుచున్నదియు మోహనునకు తెలియలేదు. ఉన్మాదునివలె నాతడా కిటికీయూచలను పట్టుకొని లాగుచుండెను. ఆ సమయమున నాతనికి మతి లేదనియే చెప్పవచ్చును.



## పదునెనిమిదవ ప్రకరణము.

---

అంతలో బిడుగుపడినట్టు లేదో పెద్దచప్పుడయ్యెను. ఆ ధ్వనికి మోహనునిగుండె లదరిపోయెను. వెనుదిరిగి చూచెను. అచ్చటనున్న గోడ తనవైపునకు నెమ్మదిగా జరుగుచు వచ్చుచుండెను. ఎటువైపైనను పోవుదమనిన దారిలేదు, ఆహా! ఇక నేమున్నది? మన మోహనుడు మనకు దక్కునా? అతడా రెండుగోడలనడుమను బడి నల్లివలె నలిగిపోవలసినదే! అయ్యో! ఎంతకష్టము!

ఎదుటగదియందున్న స్త్రీమూర్తి భయభ్రాంతయై యా దృశ్యమును గాంచుచుండెను. భయము గొలుపు చూపులతో నామె యాయువకుని జూచుచుండెను కాని యాయువకుడు మోహనరావని మాత్రము గ్రహింపజాలకపోయెను. నివ్వెరపడి చూచుటయేగాని నోటమాటలేదు. చదువరా! మన రమాసుందరియే!

మోహనున కేమియుదోచుటలేదు. అతడు గభాలున గోడయొద్దకుబోయి దానిని ముందునకు రాకుండునట్లు త్రోయుచుండెను. అతడు తనయావచ్ఛక్తిని వినియోగించి యాగోడ నావలకు త్రోయ ప్రయత్నించెను. ఎంతప్రయత్నించినను యదాతని కసాధ్యమాయెను. ఆగోడ యట్లే యెదుటగోడ యొద్దకు నెమ్మదిగా జరుగుచు వచ్చుచుండెను.

ఇంక నేమున్నది? మోహనునకు బ్రతుకుతెరవు గానుపించుటలేదు. ఆ గోడకును యీ గోడకును గల మధ్య దూర మైదడుగులుమాత్రముండెను. ఆ యైదడులు పూర్తియైనచో మోహనుని పనియు పూర్తియగును. చేయునదిలేక మోహనుడు కిటకీయూచలను రెండుచేతులతో గట్టిగ పట్టుకొని వెనుకవచ్చుచున్నగోడను తన రెండుకాళ్ళచే గట్టిగా తన్నిపెట్టి దానిని ముందునకు రాకుండునట్లు ప్రయత్నించెను. కాని యీ గోడ తన పని మానకయే యెదుటి గోడయొద్దకు వచ్చుచుండెను. మోహనుడు నిరాశజెందెను.

ఇంతలో దైవకృపవలన తాను బట్టుకొనియున్న కిటికీయూచ లూడిపోయెను. వెంటనే మోహనుడు దబాలున రమాసుందరియున్న గదిలో పడిపోయెను. అట్లు పడినప్పుడాతనిశిరముపై బలముగ దెబ్బ తగిలి రుధిరము స్రవించుచుండెను. పాపమాతడు తెలివిదప్పి పడియుండెను.

రమాసుందరి యాతనిగాంచి "ఈమహాపురుషుడెవ్వరై యుండును. హంతకుడు కాడుగదా? హంతకుడేయైనచో వీనికిట్టి స్థితి తటస్థింపదు. వారికీచిత్రములన్నియు తెలిసియే యుండును. ఈయువకుడు నూతనుడు. అందువలననే యీ పాతాళగృహచిత్రము లీతనికి దెలిసినవికావు. పాపమీతని కెట్టికష్టము సంభవించినది? ఇంతసాహసముతో యీపాతాళగృహమందు ప్రవేశించిన యీపురుషవ్యక్తి యెవ్వరై

యుండును. ఇంతసామర్థ్య మెవరికుండును ? నాపరమేశ్వరుడు—నా మోహనమూర్తి యగు—మోహనరావునకే యుండును. (తత్తరముతో) అట్లయిన యీతడు మోహనుడా యేమి ?" అని యామె యాతని దగ్గరకుబోయి మోమును పరికించెను. చూచుచుండగనే యామెముఖకమలము మూర్చ్ఛిపోయెను. ఆమె సర్వాంగము కంపించిపోవుచుండెను. నయనములనుండి యశ్రుధారలు కురియుచుండెను వెంటనే యామె "మోహనా ! త్రిభువనమోహనా ! నీకెంతకష్టము సంభవించె" నని పరవశయై మోహనునిపై బడి మూర్ఛిల్లెను.

కొంతవడికి మూర్ఛమునింగియున్న రమాసుందరి లేచి కూర్చొని మోహనునిమోము తిలకించెను. మోహనునితలకు పడినగాయమును జూచి యామె మఱింత భయవిహ్వల యాయెను. వెంటనే యామె జలముతో నా గాయమును శుభ్రపరచి తనపైటచెరగు చించి యాగాయమునకు కట్టు కట్టెను. ఆతనిశిరము తనతొడలపై నిడుకొని యాతని మోమునుజూచి దుఃఖించుచు పైటచెరంగుచే విసరుచుండెను.

ఇంతలో మోహనుడు మెల్లన కదలి కనులువిప్పి రమాసుందరిముఖమండలము తిలకించెను. ఆమె యాతనికి సపర్యచేయుచుండెనని తలంచెను.

మోహ—రమా ! నే నిట్లుంటినేమి ?

రమా—మహాశయా! మీరీమంద భాగ్యురాలి మూలముననే యిట్లుంటిరి. మీకష్టముల కన్నిటికిని యీ పాడు రమాసుందరియే కారకురాలు—మీశరీరమం దెట్లున్నది?

మోహ—బాగుగ నేయున్నది.

మోహనుడు గభాలున లేచి నిలువబడెను. రమాసుందరిగూడ లేచి నిలువబడెను. మోహనుడు రమాసుందరి రెండుచేతులను బట్టుకొని "రమా! జాగుచేయరాదు. బయటకు బోవలయును. కాని నాకు దారి తెలియదు" అనెను.

రమా—నాకు తెలియును. కాని యిప్పుడు మీరొకటిచేయవలయును. దొంగలనాయకుడు వెచ్చటకో బోయినాడు. కనుక మీరు దొంగలనాయకునిగా వేషము ధరించి యాకనబడుచున్న గృహమునొద్దకు బోయి యచ్చటనున్న "చక్రధర్" అనునాసి నడిగి తాళములను గొనిరండు. మిక్కిలి జాగరూకతవహించి యుండవలయునుసుమా!

మోహను డచ్చటనుండి వెడలిపోయెను. రమాసుందరి సంతోషచిత్తయై యా పర్యంకముపై గూర్చుండి యుండెను. ఏమేమో యాలోచించుకొనుచుండెను. కొంతసేపటికి మోహనరా వాగదియందు ప్రవేశించి తాళముల నామెచేతియందిడెను. రమాసుందరి మోహనుని వెంటబెట్టుకొని బయటకువచ్చి యచ్చటనున్న యొక గదితలుపు తెరచి

లోనికిబోయెను. ఆతడుగూడ యామెననుసరించెను. ఆగది యందొక సోఫాయును గోడపై నొక విగ్రహమును యుండెను. రమాసుందరి మోహాను నాసోఫాయందు గూర్చుండ నియమించి గోడపైనువ్న విగ్రహముయొక్క నాసికను గట్టిగా పట్టిలాగి యామెకూడ సోఫాయందు మోహానుని ప్రక్కనే గూర్చుండెను.

సోఫా నెమ్మదిగ కదిలినది. మోహానుడు నివ్వెరపడెను. కదలిన సోఫా నెమ్మదిగ విమానమువలె పైకిలేచెను. మోహానున కదంతయు నయోమయముగా నుండెను. వారు రతీమన్మథులవలె యాసోఫాతో పైకి పోవుచుండిరి. మోహానుడు రమాసుందరితో "రమా! ఈ చిత్రవిచిత్రములన్నియు నీకెట్లు తెలియును?" అనెను.

రమా—మహాశయా! అంతయు నింటివద్ద మీకె తెలింగించెదను లెండు.

వారట్లే చాలదూరము పైకిబోయిరి. ఆసోఫా యొక గదియం దాగిపోయెను. ఇరువురును క్రిందకుదిగిరి. ఆగదియంతయు విషవాయుసంకీర్ణమైయుండెను. వారితలలు తిరుగజొచ్చెను. చేతులతో ముక్కులుమూసికొనుచుండిరి. పాప మా రమాసుందరి యావిషబాధను భరింపజాలక తెలివితప్పి నేలపై గూలిపోయెను. మోహానుడామెనెత్తి నందిటనుపట్టుకొని తలుపునొద్దకువచ్చెను. తలుపుబంధింపబడియుండెను. వెంటనే

యాతడాతలుపుపై బలముగ పదాఘాతముచేసెను. వెంటనే యాతలు పాతాపుతో తునాతునకలైపోయెను. మోహను డామెతోగ బాలున బయటకులంఘించెను. ఇటునటుపరికింపగా నాతనికొకబావి కాన్పించెను. అదియే తాను మొదట భూగృహమున చూచినబావి. మోహనుడు భూగృహమున ప్రవేశించితిననితలంచి సంతసించెను.

ముందు తానువచ్చినరహస్యబిలముగుండా రమాసుందరి నెత్తుకొని బయటకు దీసికొనిపోయెను. ఆయువతీయువకు లిప్పటికి మృత్యుముఖమునుండి బయటపడిరి. అదియొకయరణ్యము. రమాసుందరికింకను తెలివిరాలేదు. ఇకనాలస్యము చేయగూడదనియెంచి యాతడామె నెత్తుకొని తనపర్ణకుటీరమునకు దీసికొనిపోయెను.

కొంతవడికి మోహనుడు చేసినయుపచారములవలన రమాసుందరి తెలివొందెను. అప్పటికి ఆమెసుందరవదనారవిందముపై చిరునగవు తాండవమాడెను. మోహనుడుగూడ యామెనుచూచుచు చిరునగవునవ్వుచుండెను ఇద్దరు నొకరినొకరు చూచుకొనుచు నవ్వుకొనుచుండిరి. ఆనవ్వులలో నేమున్నదో యెవ్వడెఱుగును!

రమాసుందరి మోహనునిభుజములపై తనరెండుకరంబులవైచి మోముపద్దమోము జేర్చి "మోహనా! నీదివ్యమం

గళవిగ్రహమును గాంచు భాగ్యము యీదీనురాలున కిన్నాళ్ళకు లభించెను. నాకంటె నికధన్యులెవరు?" అనెను. మోహనుడామె కేశబంధములనిమురుచు "రమా! నీమూలమున యిద్దరిప్రాణములు పోయినవి" అనెను.

రమా—ఎవరెవరుచచ్చిపోయిరి?

మోహ—పత్తేదారు రంగాచార్యులుగారును, రాజకుమార్తెయగుమోహనాసియును.

రమా—అయ్యో! ఎంతపని జరిగినది!

మో—రమా! ఈ సమాచారము రాత్రి కిచ్చటనేయుందము. తెల్లవారినపిదప పురమునకు పోవచ్చును.

రమా—సరే! మీ యిష్టము.

---

## పందొమ్మిదవ ప్రకరణము.

---

సుందరపురమునకు సుదూరమునందు తెల్లవారెను. ప్రభాత వాతము పరమానందదాయకముగా వీచుచుండెను. అట్టి సమయమున పద్మకోమల్లామహితో రమామోహనులు లోక శృంగార పల్లకియందు కూర్చుండి ప్రయాణముసేయుచు కోటయొద్దకు వచ్చిరి. వారి కేదో కోలాహలము వినవచ్చెను. మోహనుడు పల్లకి నుండి క్రిందికి దిగి చూచెను. ఆశ్చర్యమొందెను. అదేమి?

రాజభటులయుల్లాసము మేరమీరుచుండెను. వారందరు జయజయధ్వనులు చేయుచుండిరి. ముందువకే వచ్చు

చుండిరి. వారిమధ్య నొకదంతావళము శృంగారముగా నలంకరింపబడెను. దానిపై నెవ్వరును గూరుచుండలేదు. అంతఃపురకాంతలయుల్లాసధ్వనులు నింగిముట్టుచుండెను. విక్రమసేనుఁడు వెనుకభాగమున నొక పల్లకియందు గూర్చుండెను. బోయీలు చేయుచున్నధ్వని యా జయజయధ్వనులతో కలసి మరింత హెచ్చుచేయుచుండెను. వా రందరకును ముందు మరియొక మోహనుడు. వాడు నిజమైన మోహనుడుకాడు. వాడే శ్యామలరావు—మాయదొంగ—ప్రచ్ఛన్నవేషధారి—రాక్షసుడు—పిశాచి—భూతము. ఘోరహంతకుడు. అతడు మోహనుని రూపుధరించి, రాజును మోసపుచ్చి యెచ్చటకో దీసికొనిపోవుచుండెను.

మోహనుడు వానిని చూచెను. కోప మగ్గలమాయెను. వండ్లు పటపట గొరికెను. కండ్లెఱ్ఱజేసెను. వనరాజు పగిది హుంకరించెను. వెంటనే యాతడు వచ్చుచున్నమాయామోహనునిపై లంఘించి, కంఠము పట్టుకొనెను. ఇద్దరును కలియబడిరి. ఒక్కమారుగా జయజయధ్వనులు చల్లారిపోయెను. వా రందరును భయభ్రాంతులైరి. పల్లకియందున్నరమాసుందరి క్రిందకు దిగి యిద్దరు మోహనరావులు యుద్ధముచేయుచుండుటచే భయవిహ్వలయయ్యెను. వెంటనే యామె విక్రమసేనునియొద్దకు పరువెత్తిపోయెను.

మోహనరావు లిద్దరును మల్లయుద్ధమునకు మొదలి డిరి. ఆయుద్ధములో మాయామోహానునకు దెబ్బ లధికముగా తగుటచే నాతడు మోహానుని మెడలపై కరాఘాతముచేసి పారిపోవుచుండెను. అదే సమయమని యెంచి మోహా నుడు రివాల్వరు వానికి గురిపెట్టి ప్రేల్చెను. వెంటనే యాతడు ధరణిపై బడిపోయెను. అందరు నాపడియున్న హం తకునియొద్ద కేగిరి.అతడు నేలపైబడి గిలగిలమని కొట్టుకొను చుండెను. మోహానుడు కొలదిగ జలమును దెప్పించి, యా హంతకునిమోమున చల్లెను.

అందరు నొక్కమారుగా నాశ్చర్యచకితులైరి. అది కలయో కల్లయో గూడ నెఱుంగజాలకుండిరి. వారందరు నెవ్వరిపేరు యూరు కలనైన దలంపరో యట్టివాడు హంత కుడని యిప్పుడు వారి కండ్లయెదుటనే నిరూపింపబడెను. అందరును విస్మయచిత్తులై చూచుచుండిరి.

మోహానున కడుగడుగునకును పిడుగులుపడునట్లు జేసిన—

ఆ మాయదొంగ యెవ్వరు ?

సూర్యలాలు.

మోహానుడు సూర్యలాలును తిలకించి "సూర్య లాలూ?" అని పిలచెను.

సూర్య—నా పేరు సూర్యలాలుకాదు.

మోహ—ఓయీ! చావనుంటివి. ఇంకను నసత్య మాడెద వేల? నిజము చెప్పుము. నిజము చెప్పినయెడల నీ పాపములన్నియు పటాపంచలై పోవును.

సూర్య—ఆమాత్రము నాకు తెలియును. అందువల ననే నిజము చెప్పుచుంటిని. వినుము. నా పేరు సూర్యలాలు కాదు. శ్యామలరావు!

మోహ—ఇక నీ స్వీయచరిత్రమును చెప్పుము?

శ్యామ—మోహనా! ఈ పాడునోటితో నేజేసిన భయంకరపాపకృత్యము లన్నియు జెప్పుమనియెదవా?—మహాపాతకిని—పిశాచిని— రాక్షసుడను— నాకృత్యముల న్నియు రాక్షసకృత్యములే. కంచుకాగడబెట్టి వెదకిచూచి నను మంచికృత్య మొక్కటియు గూడ గాన్పింపదు. మరచి తిని. మోహనా! నిన్ను భూగృహమున కాళికకు బలియి చ్చిరికదా! మరల నెట్లుబ్రతికితివి?

మోహ—చచ్చినవారు మరల బ్రతుకుట యెక్కడ నైనగలదా? నన్ను కాళికకు బలీయలేదు. వారు నన్ను కాళికకు బలీయుసమయమున నా స్నేహితులచే రక్షింపబడి తిని. పాపము! నేను చచ్చితినని తలంచితివి కాబోలు!

శ్యామ—మోహనా! నీ వెంతకైనదగుదువు. దే వాంతకుడవు. నాకంటె వేయిమడుంగు లధికుడవు. అందు

వలననే నన్ను జయింపగలిగితివి. నీవు నన్ను జయింపగలవని మొదటనే యనుకొంటిని. అటులనే జరిగినది.

మోహ—ఇక నీ స్వీయచరిత్రమును జెప్పుము.

శ్యామ—చెప్పకతప్పదా యేమి ?

మోహ—చచ్చినతరువాత యిక నిన్నెవ్వరు ప్రశ్నింతురు ?

శ్యామ—అట్లయిన సావధానముగ వినుము.

మోహ—ఎచ్చటనుదాచక నంతయు చెప్పవలయునుసుమా ?

శ్యామ—ఇక దాచిన లాభమేమి ?

మోహ—అట్లయిన చెప్పుము ?

అంతయు నిశ్శబ్దము. అచ్చటనున్న జనులందరును హంతకుడేమిచెప్పునో విన కుతూహలులై యుండిరి. విక్రమసేను డచ్చటనే యుండెను. జయసేనుడు రమాసుందరియు గూడ నచ్చటనే యుండిరి. వారు నిలువబడియుండ లేదు. కుర్చీలపై గూర్చుండిరి. రమాసుందరి పెడమోము పెట్టుకొని యుండెను. ఇంతలో మోహనునితండ్రియగు జయవర్మగా రచ్చటికి వచ్చి గూరుచుండెను. ఆయన తన కుమారునిధైర్యమునకు లోలోన మెచ్చుకొనుచుండెను.

## పూర్వచరిత్ర

"మోహనా! చెప్పుచున్నాను. వినుము. నాపుట్టినస్థానము సురాటనగరము. నాతల్లిదండ్రులకు నేనొక్కడనే పుత్రుడను. నాతండ్రి పేరు ఆనందరావు. తల్లిపేరు కామాక్షి. మా కిలలేనిద్రవ్యముండెడిది. నా యీ అవయేటనే నామాతాపితలు స్వర్గస్థులైరి. నాపినతండ్రియగు వినోదరావు నన్ను, నాధనమును మిగులజాగరూకతతో జూచుచుండెను కాని యాతనిమనస్సులోమాత్రము నన్ను జంపి, నాసర్వస్వమును హరింపదలచుకొనియుండుట నాప్రియమిత్రునివలన వింటిని. ఒకనాటి రేయి నాపినతండ్రి నాయింటియందు నిదురించుచుండగా, దయారహితుడనై వానినినరకితిని. దానిలో నామిత్రుడగు వసంతరావుగూడ పాల్గొనెను. వాడును నేనును కలసి నాయింటనున్నసొమ్మంతయు వ్యయముచేసితిమి. ఇక నెంతయోద్రవ్యము లేదు. ఐదువందలరూప్యములుమాత్రముండెను. వసంతునితో స్నేహముగానుండిన యీనైదువందలుగూడ నాఖరగునని యెంచి వసంతునిగూడ యమసదనంబున కనిపితిని. ఇక నాయింటియందుండుట లాభము లేదని తలంచి యామిగిలినరూకలను పట్టుకొని యీసుందరపురము వచ్చి, చంద్రలాలుగారినాశ్రయించి, సూర్యలా లనుపేరున బరగుచుంటిని.

ఆదంపతులు నన్ను మిక్కిలిగారాబముతో తమస్వపుత్రునిగా జూచుకొనుచుండిరి. మోహనా! నాపదునారవ

యేట నేను సుదర్శనబలగములో చేరితిని. వారినాయకుని సం హారించి నేనే వారినాయకుడనైతిని. మరల యెప్పటియట్ల విక్రమసేనునియొద్ద పనిచేయుచుంటిని.

ఒకనాడు రామలాలు మాయింటికివచ్చి రమాసుంద రిని నాకువివాహముచేయుటకు స్థిరపరచి వెడలిపోయెను. నేను రమాసుందరిని చూచునిమిత్తము ఆ సాయంత్రమే రామలాలుయింటికి వచ్చుచుంటిని. త్రోవలో నీవు నాకగప డితివి. అప్పుడు నీవెచ్చటకుబోవుదువో యనుసంశయము మనమున నుద్భవింప నిన్ను వెంబడించితిని. నీవు నన్ను చూడ లేదు నీవు యుద్యానవనములో ప్రవేశించి రమాసుందరితో రహస్యముగా సంభాషించుచుంటివి నేనదంతయు వింటిని, అప్పుడు నీవామెతో "నేను బ్రతికియున్నంతవరకును సూర్య లాలు నీనీడనైనను ముట్టజాలడని దృఢముగా నమ్ము" మని దృఢప్రతిన పట్టితివి. అందువలన నాకు నీవంతటివాడవేయని భీతిజనించి నీప్రహరీని దాటుటతోడనే రమాసుందరిని దొం గిలించుకొనిపోయితిని. "మోహనా! ఈమాయానాటకమున కంతకును రమాసుందరే కథానాయకురాలు. ఇక నేనుజెప్ప లేను. తక్కినదంతయు నీకువిశదమేకదా?" అని శ్యామలరా వూరకుండెను.

మోహ—శ్యామలరావూ! శూరసింహుని హత్యనం గతి కొంచెము తెలుపుము?

శ్యామ—నాయనా! అదియా? నీమీఁదికోపముచే శూరసింహుని వలిస్తగుబాకుచే పొడిచి చంపితిని. ఆ చంపుసమయమున గోవిందలాలువచ్చి నాకు బుద్ధులుచెప్పి యాబాకును లాగికొని తనయింటబెట్టుకొనెను. మోహనా! ఆబాకునుచూచి గోవిందలాలే హంతకుడని యనుమానించితివా? గోవిందలాలు ధర్మమూర్తి. పట్టిఅమాయకుడు.

మోహ—ఆహా! గోవిందలా లెంతశాంతమనస్కుడు. తనయున్న మారటికొమరుని తనకన్నకుమారునికంటె నెక్కుడుగాజూచుచు నెట్టికష్టములకు నెనవోర్చి గుట్టంతయు పెట్టినట్లుంచెను.

అంత శ్యామలరావు "మోహనా!—యింక నీ వేమి—ప్రశ్నించినజవాబు చెప్పజాల—నానోరుతిరుగుట—లేదు—తలయంతయు గిరగిరతిరుగుచున్నది—అదిగో! నన్నెవ్వరో పిల్చుచున్నారు. నేను—ఘోరపాపిని—దుష్టుడను—రాక్షసుడను—నిజముగ రాక్షసుడనే—నాయనా! నన్ను—బాధింపకుడు—నేనేవచ్చుచున్నాను." అని యాతడు కనులు మూసెను. ఆకనులింక దెరుపవు దీర్ఘనిద్ర.

మోహనుడు కొందరు రాజభటులను బిలచి యాకళేబరమును దహనసంస్కారము చేయ నాజ్ఞనిచ్చెను. మోహనునియాజ్ఞానువర్తులై కొందరు రాజభటు లాకళేబరమును గొనిపోయిరి. మోహనుని ప్రియత్నములన్నియు ఫలించె

ను. ఇక నాతని కేమికావలయును ? రమాసుందరి దొరకెను. హంతకుడు మృతినొందెను. ఇక నాతడు గుండెలపై జేయి వైచుకొని హాయిగ నిదురింపవచ్చును.

---

ఇరువదవ ప్రకరణము.

---

# ఉపసంహారము.

సాయంసమయము. మోహనుడు కోటలో బహిర్మందిరమునందున్న సోఫాపై గూర్చుండి పత్రికను చదువుకొనుచుండెను. అతడు నిర్వ్యాపారుడై యుండెను. ఇంతలో రమాసుందరి యాగదియందు ప్రవేశించెను. ఇప్పుడామె క్షీణించియుండలేదు. ఆసన్నుతాంగి యువగులయందమును — దొడవుల చందమును — నడబెడంగును — నాసికసొగసును — మాటల తేటయు — పాటలబాగును — గనిన నెట్టివారికైనను కనుపండు వొనర్చుచుండును. ఆయువతియౌవనము పరిపూర్ణస్థితి నొందుచున్నది. ఆమెమనోహరసుందరాంగములపై లజ్జాలతలు ప్రాకుచుండెను. ఆలతలు నిదురగన్నేరులతలవలె ముట్టిన నిద్రించువానివలె గాన్పించుచుండెను. ఆరమాసుందరిమనోహరాంగములను చూచిన మోహనుడు మతిమాలినవాడైపోవును. ఉంగరములగు నెరిసీలంపుకురులు — ముద్దులుమూటగట్టువదనము — కలువరేకులవంటికనులు — ఇవన్నియు మ

నోహరము లే. ఆమెధరించిన రంగు రంగులబట్టలనడుమ నామె వదనపద్మమును—కన్నులును— హస్తరాజీవమును— కొలనులో నీలంపునీరంబులనడుమ పత్రములనూటున సగము సగముగ గన్పట్టుచు ప్రకాశించు తామరపూలను కలువలను దలపించుచుండెను.

మోహను డామెనింకను చూడలేదు. రమాసుందరి మోముస చిరునగవు మొలకలెత్త మోహనుని వెనుకనుండి యే బోయి హస్తములతో మోహనునికనులు మూసెను. ఆతనిచదు వాటంకమాయెను.

మోహ—సుందరీ! పేరు చెప్పకొంటిని ఇక నా కన్నుల వదలివేయుము.

రమాసుందరి కనులు మూయుటమాని నవ్వుచు నాతని ప్రక్కను గూరుచుండెను. "సుందరీ! ఏలవచ్చితివి?" అని యడిగెను.

రమా—నిన్ను తీసికొనిపోవలయునని—

మోహ—ఎచ్చటకు?

రమా—ఉద్యానవనమునకు—

మోహ—అచ్చట నెవరుండిరి?

రమా—నాసోదరి మాలతి—

మోహ—నే నిప్పుడు రాను.

రమా—ఎందువలన?

మోహ—నేను చదువుకొనవలయును.

ను. ఇక నాతనికేమికావలయును ? రమాసుందరి దొరకెను. శాంతకుడు మృతినొందెను. ఇక నాతడు గుండెలపై చేయి వైచుకొని హాయిగ నిదురింపవచ్చును.

---

ఇరువదవ ప్రకరణము.

---

# ఉపసంహారము.

సాయంసమయము. మోహనుడు కోటలో బహిర్మందిరమునందున్న సోఫాపై గూర్చుండి పత్రికను చదువుకొనుచుండెను. అతడు నిర్విచారుడై యుండెను. ఇంతలో రమాసుందరి యాగదియందు ప్రవేశించెను. ఇప్పుడామె క్షీణించియుండలేదు. ఆసన్ను తాంగి యుపగులయందమును— దొడవుల చందమును— నడబెడంగును—నాసికసొగసును—మాటల తేటయు—పాటలబాగును—గనిన నెట్టివారికైనను కనుల పండు వొనర్చుచుండును. ఆయువతియౌవనము పరిపూర్ణస్థితి నొందుచున్నది. ఆమెమనోహరసుందరాంగములపై లజ్జాలతలు ప్రాకుచుండెను. ఆలతలు నిదురగన్నెరులతలవలె ముట్టిన నిద్రించువానివలె గాన్పించుచుండెను. ఆరమాసుందరిమనోహరాంగములను చూచిన మోహనుడు మతిమాలినవాడై పోవును. ఉంగరములగు నెరిసీలంపుకురులు—ముద్దులుమూటగట్టువదనము—కలువ రేకులవంటికనులు—ఇవన్నియు మ

నోహరము లే. ఆమె ధరించిన రంగు రంగుల బట్టల నడుమ నామె వదనపద్మమును—కన్నులును— హస్తరాజీవమును— కొలనులో నీలంపునీరంబుల నడుమ పత్రముల మాటున సగము సగముగ గన్పట్టుచు ప్రకాశించు తామరపూలను కలువలను దలపించుచుండెను.

మోహను డామెనింకను చూడలేదు. రమాసుందరి మోముపై చిరునగవు మొలకలెత్త మోహనుని వెనుకనుండియే బోయి హస్తములతో మోహనునికనులు మూసెను. ఆతని చదు వాటంకమాయెను.

మోహా—సుందరీ! పేరు చెప్పకొంటిని ఇక నా కన్నుల వదలి వేయుము.

రమాసుందరి కనులు మూయుట మాని నవ్వుచు నాతని ప్రక్కను గూరుచుండెను. "సుందరీ! వేలవచ్చితివి?" అని యడిగెను.

రమా—నిన్ను తీసికొనిపోవలయునని—

మోహా—ఎచ్చటకు?

రమా—ఉద్యానవనమునకు—

మోహా—అచ్చట నెవరుండిరి?

రమా—నాసోదరి మాలతి—

మోహా—నే నిప్పుడు రాను.

రమా—ఎందువలన?

మోహా—నేను చదువుకొనవలయును.

రమా—సరే ! మీరిచ్చట నేయుండుడు.

రమాసుందరి వెడలిపోయి మాలతినిగూడ తీసికొని వచ్చెను.

మాల—మోహనా ! రావా ?

మోహ—(నవ్వుచు) నేను రాను.

రమా—మోహనా ! రావా ?

మోహ—నేను రాను.

అని నవ్వుకొనుచు బలికెను. అంత వాయిద్దరు యువతులును మోహనుని రెండుకరములను పట్టుకొని యాతనిని యుద్యానవనమునకు లాగికొనిపోయిరి. మోహనుడు చేయునదిలేక వారివెంటనే వెళ్ళిపోయెను.

పిల్లవాయువులు మెల్లన వీచుచుండెను. ఉద్యానవనములో తూగుటుయ్యెలలో మోహనుడు గూరుచుండి మిక్కిలి యుల్లాసముగ నూగుచుండెను. అతనికిరుప్రక్కలను రమామాలతులు గూరుచుండిరి. నిర్మలసరసీజలతరంగడోలికావాలికలపై నొయ్యారముగ నుయ్యెలలూగి వీచు సాయంసమీరము వారి మేనులదాకి మనోరంజకముగా తూగుటుయ్యెల లూగుచుండిరి.

అదియే వారికి దేవేంద్రభోగము—స్వర్గతుల్య పరమానందము—బ్రహ్మానందము.

ద్వి తీ య ఖ ం డ ము.

స ం పూ ర్ణ ము.

---